శ్రీ

# అభిజ్ఞానమణిమంత నాటకము.

[ లేక చంద్రహాస ]

ఇది

"ఆంధ్రనాటకపితామహ" యను బిరుదువహించిన


## ధర్మవరం-రామకృష్ణమాచార్యుల చేత


రచియింపఁబడి


డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవల్ల ప్రకటింపబడిన

రెండవ కూర్పు.

బళ్ళారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.




శ్రీ

# విజ్ఞాపనము.

———(0)———

ఆంధ్రసారస్వతము దినదినమునకును విస్తరించుచున్నది. లోకులచ్ఛాందసత నానాఁటికి క్షీణించుచున్నది. ఇదియొక శుభసూచన. ఎంతరుచికరములైనను, నెంతనీతిదాయకములైనను నాదరింపఁబడకుండిన విషాదాంతనాటకము లిప్పుడత్యంతాదరమును బడయుచున్నవి. ఇందులకు విషాదసారంగధర నాటకమే తార్కాణము. అదియప్పుడే నాలవసారి ముద్రింపఁబడి యైదవముద్రణ కెదురు చూచుచున్నది. దీని వలన ఖేదాంతనాటకములు మనవారి నెంతయాకర్షించియుండుట స్పష్టమగుచున్నది.

తొలుదొల్త నీచంద్రహాసనాటకము సైతము విషాదాంతము గానే రచియింపఁబడియుండె. కానియట్టినాటకములంతగా నాదరింపఁబడనియాకాలమున ఖేదాంతముగానే దీని బ్రదర్శింపఁగాని ప్రకటింపఁగాని ధైర్యముచాలమి గ్రంథకర్తదీనిని, దనమనసొప్పకున్నను, మోదాంతముగమార్చె. అట్లేదీని ప్రథమ ముద్రణముగావింపఁబడియెను. కాని యిటీవల స్థితిగతులఁబరామర్శించి కవితొలుతనుద్దేశించిన విధముననే యిదియిప్పుడు ఖేదాంతముగ ముద్రింపఁబడియెను. దీనిప్రథమ ముద్రణమునాఁటికే లోకమించించుక ఛాందసతవీడుచుండెననుటకీ నాటకము గూర్చిన 15-8-16 నాఁటియాంధ్రపత్రికలోని యీక్రిందిమాటలే సాక్ష్యములు.

“కవిపుంగవులును ప్రదర్శకాగ్రగణ్యులునగు నాచార్యులవారి చే-రచింపఁబడిన చిత్రనళీయము, విషాదసారంగధర, పాదుకాపట్టాభిషేకము మున్నగు నాటకములకీ చంద్రహాసనాటకముగూడ నెందునను తీసిపోవునదిగాదు. సహజముగ కథయందే నవరసపోషణంబున కవకాశముచాలకొద్దిగనున్నది. అటులయ్యును ఆచార్యులవారు చాలశ్రమచేసి ప్రతిరంగమునుగూడ మనోహరముగనుండునట్లు రచించిరి. ఎట్లైనను మొదటి రెండంకములును సామాన్యముగనుండును గాని మూఁడఅంకము మొదలు కడవరకునుగూడ చాలమనోహరముగనుండును. దీనిని దుఃఖాంతనాటకముగ రచించి మదనకుంభీనసుల నిరువురిని గానిఁలేక కుంభీనసునొక్కనినైనగాని గతప్రాణునిగా నొనరించిన దీని నీతిని ప్రేక్షకులు మఱింత స్ఫుటముగ గ్రహింపఁగలుగుదురని తోఁచుచున్నదిగాని, మనవారట్టి ప్రదర్శనములను చూచిసహింప జాలరనిగాబోలు ఆచార్యులవారు దీనిని కళ్యాణాంతముగ నొనర్చియున్నారు. ఆంధ్రలోక విఖ్యాతులగు నాచార్యులవారి రచనాచమత్కృతిని వర్ణింపఁగడంగుట వెఱ్ఱితనము. ఇదివరకాంగ్లభాషలో నొకరీనాటకమును వ్రాసియున్నను ఆచార్యులవారు దాని నాధారముగ గొనక స్వకపోలకల్పలనే యొనరించుట కడుంగడు ప్రశంసనీయము”.

ఇట్లే ముక్తావళీనాటకము బలవంతముగ మోదాంతముగ నొనర్పఁబడియున్నది. అదియింకొకసారి ముద్రింపఁబడు భాగ్యముగాంచెనేని ఖేదాంతముగనే ముద్రింతుమని విన్నవించివారము.

ఇట్లుబుధవిధేయుఁడు,
డి. కె. కృష్ణమాచార్యుడు.
ప్రకాశకుడు.

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు:—

## —తత్ప్రవేశస్థళములు.

### పురుషులు.

సుదర్శనుఁడు—(కుంతలరాజు) అం. 1. రం. 1, 4 అం 11 రం, 2, అం. IV రం. 3, అం. V రం 1, 2,

కుంభీనసుఁడు—(సుదర్శనుని మంత్రి దుష్టబుద్ధియని మరియొక పేరు) అం. 1 రం. 1, 2, 4 అం. 11 రం. 2, 3. అం. 111 రం. 1, 2, అం. 1V రం. 1, 2, అం. V రం. 2,

మదనుఁడు—(కుంభీనసుని పుత్త్రుఁడు) అం. 11 రం. 3 అం. 111 రం 3 అం. IV రం. 1. అం. V రం. 1, 2,

చంద్రహాసుఁడు—(సుదర్శని మేనల్లుడు. కథానాయకుఁడు) అం. 111 రం. 1, 2, 3. అం. IV రం. 1, 2. అం V రం. 1, 2,

మణిమంతుఁడు—(చంద్రహాసుని చిన్ననాటిపేరు) అం. 1 రం. 3

కుళిందుకుఁడు—(చందనావతిరాజు) అం. 1 రం. 3. అం. 111 రం. 1, 2.

గాలవ—(కుంతలాస్థనపు జ్యోతిష్యకుఁడు) అం. 1 రం. 2

సదాచార నాగరికలు—(చందనావతిలోని వారలు) అం 11 రం. 1

జంఘాలుఁడు—(రాజసేవకుఁడు), అం. 111 రం. 1

బిందోజి—(పాము లాటవాఁడు) అం. IV రం. 2 అం. V రం. 2

అఘోరుఁడు—అం. 1 రం. 3 అం. V రం. 1, 2,

బోయ—అం. 1 రం. 3

చెంచువాఁడు—అం. 1 రం. 3 అం. V రం. 1, 2,

కేరళబ్రాహ్మణుఁడు—అం. 1 రం. 4 అం. V రం. 1, 2,

పూజారి—అం. V రం. 2

### స్త్రీలు.

విషయ—(కుంభీనసుని పుత్రి. చంద్రహాసుని పట్టపుభార్య కథానాయికి) అం. 1I రం. 3 అం. III రం. 3 అం. IV రం. 1 అం V రం. 2,

చంపకమాలిని—(కుంతలేశుని పుత్రి) అం. III రం. 3 అం. IV రం. 3 అం. V రం 1, 2,

వాసంతిక—(మదనుని మోహించిన కుంతలేశుని మేనకోడలు) అం. III రం. 3 అం. IV రం. 3 అం. V రం. 1, 2,

సేవకులు, రాజభటులు మొదలగువారు.

# అభిజ్ఞానమణిమంతనాటకము.

---:o:---

## కథాసంగ్రహము.

### ప్రథమాఙ్కము.

రంగము 1. కేరళ రాజ్యములోనున్న తనపినతండ్రి కూతురి కొమార్తెయు కొమారుడు నగు వాసంతికా మణిమంతులు తల్లిదండ్రుల పోగొట్టుకొన్నవారు యింకను తనపురికి రాకయుండుటకు కారణమును గురించి కుంతలరాజగు సుదర్శనుడు మంత్రియగు కుంభీనసునితో (ఇతని పేరేదుష్టబుద్ధి) ఆలోచించుట.

రంగము 2. కుంభీనసుడు ఆస్థాన జోతిష్యుడగు గాలవునితో నాలోచన సలుపుట. తనయభీష్టసిద్ధికి నడుమనున్న మణిమంతుని తొలగించి వేయుటకు మనసున నిర్ధారము చేశికొనుట.

రంగము 3. అడవి—అఘోరుడను హత్యకారుడు, మణిమంతుని చంపుటకై యడవికి కొనిపోయి చంపను మనసురాక కుడికాలు బొటనవేలు మాత్రము నఱికి కొని పోవును. సుదర్శనరాజునకు సామంతుడైన కుళిందకు డనుపేరుగల చందనావతీ విభుడుచూచి స్వయంప్రాప్తసుతునిగా చేసుకొని వానికి చంద్రహాస నామము నిడును.

రంగము 4. మణిమంతుని పోగొట్టుకొన్న సుదర్శనుని సంతాపము.

### ద్వితీయాఙ్కము.

రంగము 1. చంద్రహాసుడు బహుధర్మరీతిగా చందనావతిని నేలుచుండి నందున కలిగిన ఫలములను గురించి సదాచార నాగరికుల అనువారి సంభాషణము.

రంగము 2. కుళిందకునినుండి సుదర్శనరాజునకు అమూల్యములగు కానుకలు వచ్చి యుండును. దురాత్ముడగు కుంభీనసుడు చందనావతిచూచి వచ్చుటకు సుదర్శను ననుజ్ఞవడయును.

రంగము 3. కుంభీనసుడు తనకూతురగు విషయను మాధవుడను ఒకముదిరాజునకు కట్టనుద్దేశించుట. తరువాత తనకొడుకగు మదనుని సుదర్శనుని కూతురగు చంపకమాలిని పరిణయమాడుటకు సిద్ధపడుమని అడుగును. ఉభయులు తిరుగబడుదురు.

## తృతీయాఙ్కము.

రంగము 1. కుంభీనసుడు చందనావతిని చూచి అసూయాగ్రస్తుడగుట. అందున్న చంద్రహాసుడు. మణిమంతుడగుట నెరగి తనయభిప్రాయము దాచుకొనుట. కుంభీనసుని అధికదుఃఖము.

రంగము 2. చంద్రహాసుడు ఆలయమునకుపోవు సంభ్రమము కుంభీనసుడు చాటునుండి చంద్రహాసునిచంప బాణమువైచు గురితప్పిపోయి గుర్తింపబడి చంద్రహాసునివలన రక్షింపబడుట.

రంగము 3. కుంతలోద్యానము :— చంద్రహాసుని ఆగమనము, విషయ వాసంతిక చంపకమాలిని మొదలగువారి వనవిహారము. వాసంతికా మదనుల సంభాషణము. మదనుడు తనకు వాసంతికపై మోహము తిరుగరానిది అనిచెప్పికొనుట. వాసంతిక కొన్ని సంశయించిన మాటలాడిన మదనుడు మహాదుఃఖమున ప్రతిజ్ఞ యొనర్చుట. నిద్రించియున్న చంద్రహాసుని చంపకమాలినిచూచి మోహించి విషయ య్యాయెడకు వచ్చుటగమనించి సరసిలో దాగికొనుట. విషయ చంద్రహాసుని మోహించి మేలుకొలుపుట. వారి ప్రేమ సంభాషణము. చంపకమాలిని దుఃఖావేశము తరువాత చంపకమాలిని చంద్రహాసుల అవ్యవస్థిత సంభాషణము. కుంభీనసుని యొద్దనుండి మదనుకి జంఘాలుడు తెచ్చియున్న రహస్యలేఖను కుతూహలముతో విషయ విప్పిచూచి అది చంద్రహాసుని మరణలేఖగా నెరుగుట. విషయ దుఃఖించి యాలోచించి సూక్ష్మముగా కొన్ని తుడుపులుపెట్టి యామరణలేఖను, తనపెండ్లికమ్మగాచేయుట. చంపకమాలిని విషయల విచిత్రసంభాషణము. మదనుడు చంద్రహాసునికి విషయనొసగుట (ఇదియీనాటకము

## చ తు ర్థా ఙ్క ము.

రంగము 1. కుంభీనసుడు తానొనరించిన యుద్యమము నిష్ఫలమగుట తెలిసి మహాదుఃఖము చెందుట.

రంగము 2. కుంభీనసుడు బిందోజియను పాములవానితో నాలోచించి యారాత్రియే కాళికాలయమున చంద్రహాసునిచంపనిర్ధారయొనర్చుట.

రంగము 3. వాసంతిక చంపకమాలిని నిజస్థితి సుదర్శనునికి నెరిగించుట.

## ప ఞ్చ మా ఙ్క ము.

రంగము 1. అఘోరునివలన మణిమంతుని హత్యోద్యోగము సుదర్శనరాజెఱుగుట చంపకమాలిని మణిమంతునికి నిశ్చితార్థము చేయుట.

రంగము 2. కుంభీనసుని పూర్ణోద్యోగము. చంద్రహాసునికి మాఱుగా మదనుడు కాళికాలయమునకు వచ్చుట. ఘోరసర్పములచే కఱవబడి మూర్ఛిల్లుట. కుంభీనసుడు తనకొడుకును గుర్తించి దుఃఖించి మూర్ఛిల్లుట. పూజారివలన నీ వృత్తాంతము నెరిగి సుదర్శనాదులు కాళికాలయముచేరుట మదనునికి బిందోజి చికిత్సయొనర్చి సర్పవిషముదించుట. అఘోరుడు కుంభీనసుని గుర్తించుట. కుంభీనసుని ఒప్పుదల. ఉత్తరరంగ రూపమైన కుంభీనసుని యుపదేశము. కుంభీనసుడు ఆత్మహత్యగావించుకొనుట.



శ్రీ

# అభిజ్ఞానమణిమంతనాటకము.

## ప్రథమాఙ్కము: ప్రథమరంగము.

కుంతలరాజగు సుదర్శను నాస్థానము.

———:0:———

[ప్రవేశము: సుదర్శనుఁడు, కుంభీనసుఁడు.]

సుదర్శనుఁడు — కుంభీనసా! ఇన్నిదినములయ్యు నింకను గేరళమునుండి యెవరును రాకున్నారు. ఆ మణిమంత కుమారునకును, వాసంతికకును నెట్టిపాటు కలిగెనో తెలియకున్నదిగదా!

కుంభీనస — రాజచంద్రా! ఇట్లేల చింతింపవలయును. కేరళరాజ పురోహితుఁడు వారి నింతలోననే పంపుచున్నానని వ్రాసియుండలేదా? ఇంతలోననే రావచ్చును.

సుదర్శన — మంత్రిసత్తమా! నే నేమని వచించువాఁడ. ఆ కేరళాధీశు రాణియగు హైమవతీదేవి నాకుఁ జిన్నతండ్రికూతురై యున్నను బ్రేమమున నా చెల్లెలికంటె నెక్కుడు. ఆ యనుంగుఁజెలియలిఁ జూచి యాఱుసంవత్సరములాయెను. ఆయమ కుమారుఁడు మణిమంతుఁడు పుట్టినపిదప నెన్నిమాఱులో నన్నయ్యెడకు రమ్మని చెప్పిపంపెను. కార్యపరవశత్వమున నేఁబోవఁజాలనైతిని. నాయనుజను, నాయనుజవిభుఁడు, నామఱఁదియగు పురందరునిఁ జూడవలయునని కేరళమునకుఁబోవఁ బ్రయాణసన్నాహ మొనరింపుమని రెండు నెలలక్రిందటఁగదా నీతోఁ జెప్పితిని. ఇంతలో నిట్టి యుట్టిపాటు కలుగునే. ఆచెలియలు నామఱఁదియు నిట్లుప్పృతిఁ జెందుదురే!

ఉ. ఆదట నీడులేని కడునర్మిలి నాకు ముదంబు నించు నా
సోదరియున్మఱంది యొకచో నొకనాఁడె ధరిత్రిఁ బాసిర
య్యో దయమాలి దైవమిటు లొప్పమి దాసమకూర్పఁ జాలు నే
యాదరిలేని శోకమెటు లే భరియించెద మంత్రిసత్తమా.

కుంభీనస — సుదర్శనరాజేంద్రా! మీరీవిషయమున నెంతశోకించినను ప్రయోజనమేమైనఁ గలదా? శూరవతంసమని నుతికెక్కి దిక్కులరాజులనెల్లఁ జరణదాసుల నొనర్చిచన్నె వాసిఁగాంచియున్న నీమఱఁది పురందరునకు యుద్ధమరణమున కంటె సౌఖ్యము వేఱు గలదా? హస్తమున ఖడ్గముపట్టువదలక రణరంగమున వీరస్వర్గముఁ గాంచిన యాతనికై చింతిల్లవలదు.

మ. కరవాలంబు కరంబుఁ బాయక నిరాఘాటకృదాభీలతన్
బరసైన్యౌఘము వాహినీపతులతో భంజించి చెండాడి ని
ష్ఠురయుద్ధావనిఁ బోరిపోరి హతులై సొంపొందు స్వర్లోక ని
ర్భరసమ్మోదము గాంచుకంటెఁ గలదే భాగ్యంబు శూరాళికిన్.

ఇంక నాహైమవతీదేవి యన్న నావృపతితో నగ్నిప్రవేశ మొనర్చి సతీమహాత్మ్యమున నపరహైమవతి నా నుతికెక్కె. ధీరసతుల కంతకంటెఁ బుణ్యముకలదా? ఆయమకొఱకు జింతింపఁబనిలేదు. ఇంక నీమేనయల్లుఁడు మణిమంత కుమారుఁడును, మేనకోడలు వాసంతికయుఁ గేరళపురోహితుని కరుణఁజేసి యింతలోననే రాఁగలరు.

సుదర్శన — కుంభీనసా! నీవేమో యూఱడిల్ల నాడెదవు. నాకూఱటగలుగదు. ఆపురోహితుఁడు వారలఁ బంపెద నని నాకు జాబు వ్రాసి పలదినములు కావచ్చె నింకను రారైరి. నామదికి భీతివొడమెడు. ఏమేమో యాలోచన లుప్పతిల్లెడు. ఆమణిమంత కుమారునిపై నేనెంతయాశనో పెట్టియుంటిని. నాకు నలువదియేఁడు సంవత్సరములవఱకు నెన్ని వివాహములైనను సంతానము కలుగకుండుటచే మన పురోహితుఁడగు గాలవునితో నిప్పుడు నాలుగేఁడుల క్రిందట నాప్తాలోచనము సలిపియుంటిని. అతఁడు నాకుఁ గుమారులు గలుగఁజాల రనియు, దౌహిత్రసంతతివలన రాజ్యము నిలువఁ గలదనియు నాపిదప నాయల్లుఁడగువాఁడే యీరాజ్యమునకు రాఁగలవాఁడనియు నుడివె. ఈ వృత్తాంతము నీతోడను జెప్పియుండనైతి. అప్పటికి నాచెలియలు మణిమంతునిఁగని యొకవత్సరమైయుండెను. గాలవుఁడు వచించిన తీరున నాకుఁ గూఁతురు గలిగెనా మణిమంతున కొసఁగి కేరళముతోఁగూడ నీరాజ్యమును గట్టనెంచియుంటి. అట్లే రెండుసంవత్సరముల క్రిందట మాచంపకమాలిని నాకుఁగలిగె. నాయెంచినతీరున జరుగఁగలదుగా యని సమధిక సమ్మోదోత్సాహభరితుఁడనైతిని. ఇప్పుడిట్లు సంభవించె. నాయభిలాష మెట్లు పూర్ణము కాఁగలదో యెఱుఁగను.

చ. చెలియలికై యలందు రెదఁ జేష్వడి పొక్కెద నా మఱందికై
బలువెతలెన్ని గల్గినను వాసిభరించి సహింతుఁగాక ని
ర్మలవిభవోజ్జ్వలుండు మణిమంతకుమారుఁడు రామిచూడఁగాఁ
దలఁకుఘటిల్లెనెమ్మదినిఁ దాళఁగఁజాల నమాత్యపుంగవా.

కుంభీనస—రాజేంద్రా! ఊరకయింతేల యోచింపవలయును. గాలవునియెడ నా కెంత విశ్వాసము గలిగియున్నను జ్యోతిషమునందు నాకేమాత్రమును నమ్మకము గలుగదు. "భవంతి నభవంతిచ" యనుటశుద్ధానిశ్చయ శాస్త్రము. మీకుఁ గుమారుఁడే యేల కలుగరాదు? పోనీ. కలుగలేదనియే యనుకొనుము. ఇప్పుడు యోచింపను గారణమేమున్నది? మణిమంతుఁడవశ్యమచిరకాలముననే రాఁగలఁడు. మీయభిలాషను నెఱవేఱుఁగలదు. అదిగాక యిప్పుడు మనము కేరళమునకు గొప్పసైన్యముఁ బంపి యుండలేదా, యందుఁ జెఱలోనున్న పురందరుని యనుజుని సుమేరునిఁ జెఱవిడిపించి శత్రువుల నణమాడి రాజ్యము సాధింపదు? సంఖ్యాతీతమగు మనసైన్యమేమి సాధింపఁజాలదు? అన్నియు శుభోదంతములే వినవయ్యెదు. ఊఱడిల్లవలయును.

సుదర్శన—మంత్రిసత్తమా! నీమాట సత్యము. రానున్న దుఃఖము వచ్చువఱకు ముందుగా యోచింపనేల? ఎదుర్కొననేల? ఊఱడిల్లెదను. కేరళమునకుఁ బోయియున్న మనసైన్యము వృత్తాంతము దినదినము నెఱుఁగుటకై యంచెలవారిఁ బెట్టించుము. విధిలేకున్న మనమే మిగిలిన సైన్యముతో యుద్ధమునకుఁ బోవలసివచ్చినను వచ్చును.

కుంభీనస—భాగ్యము. మీరు చెప్పుటకుముందే యీ కార్య మొనరించి యున్నాను. [illegible] ప్రథమ వృత్తాంతమును దెలియఁగలదు.

(నిష్క్ర-9)

—0—

ప్రథమాంకము ద్వితీయరంగము (కుంభీనసుని యిల్లు).

:0:

[ప్రవేశము: కుంభీనసుఁడు. గాలవుఁడు.]

కుంభీనస—గాలవా! ఈ వృత్తాంతము నాతో నేల చెప్పవైతివి?

గాలవ—ఏమి విశేషవృత్తాంతమని చెప్పవలయును? అప్రస్తావమును గలుగలేదు.

కుంభీనస—శాస్త్రమున కేమి? కొడుకే యేల కలుగరాదు?

గాలవ—నా యెఱిఁగిన శాస్త్రముఁబట్టి కలుగఁడనియే చెప్పవలయు. ఇప్పుడిదేల యడిగెదు?

కుంభీనస—మా రాజునకుఁ గొడుకు కలుగఁడని వినినందున నెక్కుడగు సంతాపము వొడముట విచారించితిని. నీకుఁ గోపమువలదు. నాకెందుకో విశ్వాసము గలుగదు?

గాలవ—నీ యిష్టము, నాతప్పిదము కాదు.

కుంభీనస—పోనీ! నాకొడుకు మదనుని జాతకముఁ జూచి వానికి రాజసంబంధము కలుగునంటివే, యది నిశ్చయమా?

గాలవ—విశ్వాసమే కలుగనియప్పు డేది యెట్లు నిశ్చయమగును?

కుంభీనస—ఊరక వినోదమున నడిగితిని. విశ్వాసమున్నదనియే చెప్పుము.

గాలవ—విశ్వాసమున్న ఫలము వెంటనే కలుగు.

కుంభీనస—ఫలము కలుగునేని వచింపుము. మా మదనునకు నీరాజు కూఁతురు చంపకమాలిని యనుకూలమగునా?

గాలవ—ఇది నేనెట్లు చెప్పఁగలను? తన చంపకమాలిని నీరాజు కేరళమునందలి తన యల్లునకు మణిమంతున కియ్య నెంచియున్నాఁడే, నీ వెఱుఁగవా?

కుంభీనస—నేనెట్లెఱుఁగుదును! నాకేమి జ్యోతిషము తెలియునా? రాజును జెప్పఁడాయె. నీవును జెప్పవైతివి.

గాలవ—ఏమో ప్రస్తావము రాలేదు.

కుంభీనస—ఇప్పుడు నాకు సంతోషము.

గాలవ—ఏమి సంతోషము?

కుంభీనస—తన కూఁతును నాకొడుకున కిచ్చుటకు రాజెక్కడ బలవంతము చేయునోయని భయపడియుంటిని.

గాలవ—అందునకు భయమేటికి?

కుంభీనస—గాలవా! నిక్కము వచించెదను. జనసామాన్య మెందును దుష్టము. ఏమియు లేకయే యీరాజు నావలనఁ జిక్కి చేతిబొమ్మవలె నేనెట్లాడించిన నట్లాడుచున్నాఁడని దుర్జనులనుకొనుచున్నారు. నాకుఁ గుంభీనసుఁడను పేరేచాలుఁగదా? అది తలిదండ్రులిడిన పేరు. విధిలేదు. అదిచాలక యీనీచాత్ములు నాకు "దుష్టబుద్ధి" యని ముద్దు పేరొకటి పెట్టియున్నారు. ఈ జను లెట్లయినను దప్పులెంచువారేగాక గుణముగ్రహించువారు కారు. రాజునొద్దఁ గొంచెమెడము కలిగియుంటిమా సరియయిన సేవకుఁడు గాదందురు. ఒద్దిక గలిగియుంటిమా రాజువీనిచేతిబొమ్మయందురు. ఎట్లున్నను గష్టమే నేనసిధారావ్రతమువోలెఁ గాలము నెట్టుచున్నాను. ఇందులో రాజుతో సంబంధము నాకొకటి కలిగెనా మనినంత కాలము తలముఁకలుగా నపకీర్తిపాలుగదా? కావున నది తప్పుట మిక్కిలి సంతోషముగదా? పోనీ! గాలవా! ఆమణిమంతుఁడైనను జంపకమాలినిఁ జేపట్టువాఁడేకదా?

గాలవ—నన్నేమి శకునము చెప్పుమంటివా? నాకు దేవపూజవేళ యయినది. నేఁబోయి వత్తును. (నిష్క్రాన్తి)

కుంభీనస—ఆహా! ఇట్లున్నదా? ఇప్పుడు తెలిసెను. ఈ రాజు నాతో వినోదములాడు కాలమునఁ బూర్వము నావైదర్భకూరిమి వెల్లడిచేయుచు నాకుఁ గొడుకును దనకుఁ గూఁతురును గలిగినను, లేక దనకుఁ గొడుకును నాకుఁ గూఁతురును గల్గినను సంబంధ మొనరింపవలయునని మాటలాడుచుండె. అప్రాప్తి నాకుఁ గలుగునాయని యోఁకరుచుంటి, దైవాధీనముగా నేఁడుసంవత్సరముల క్రిందట నాకు మదనుఁడు కలిగె. రాజునకు దుహితపుట్టునాయని కోరుచుంటి. రెండేండ్లక్రిందట నదియుఁ గలిగె. ఆబిడ్డపుట్టుటకు మూఁడు సంవత్సరములక్రిందట వఱకు "మంత్రీ! మనమెంచినభంగి నీకుఁ గొడుకు కలిగె, నాకుబిడ్డ మాత్రము గలుగవలయు" నని రాజువచించుచుండె. ఆ బిడ్డకలిగిన నాటనుండి యీమాటే యాడఁడాయె. సందర్భవశమున నొకప్పుడు నేనే యాప్రస్తావము నెత్తినను దాని గీటునఁబుచ్చుచు వచ్చె కారణమూహసేయనైతి. నాయట్టిమూఢాత్ముఁ డెవ్వఁడైనఁ గలఁడా? వానిపినతండ్రికూఁతురగు హైమవతికి మణిమంతకుమారుఁ డుదయించిన వృత్తాంతము తెలిసియుండియు నీయైదువత్సరముల నుండి యీ విషయము నూహింప లేకుంటిఁగా? ఇట్లు కావలసియున్నదా? ఈ ముదినగ్గున కింకఁ గొడుకు కలుగఁడు. నాకొడుకే వాని కల్లుఁడై రాజ్యమునకు రాఁగలఁడనియు, నుబ్బిట్లూఁగుచుంటినే? ఇంతాశాభంగము కలుగనున్నదా? నా జన్మమున నెట్టివిషయమునఁగాని యాశాభంగమన్న మాటయే యెఱుఁగను. ఇప్పుడు ఘటింపనున్నదా?

శా. నానాభంగుల రాజ్యమబ్బెనని యానందంబునిండార లో
లోనం బొంగితి నిన్నినాళ్ళొదవె నీలో నంత రాయంబు ప్ర
జ్ఞానవ్యక్తిని నేనెఱుంగఁగద యాశాభంగ మీవేళ నా
న్యూనత్వంబుఘటిల్లఁజేయ మణిమంతుండేడఁ జేకూరెనో.

కానీ! కానీ! ఈవైయర్థ్యత కేదికారణము? ఆకుమారాధముఁడగు మణిమంతుఁడేకదా నాకును రాజ్యమునకును నడుమనున్నవాఁడా పాత్రుఁడగు మణిమంతుఁడేకదా? ఇంకఁ దడయవచ్చునా? ఆమణిమంతుఁడొకఁడు లేకుండెనా నాకొడుకున కనఁగా నాకు నీ కుంతలరాజ్యములభించును. ఆ కేరళరాజ్యమున్ననో నాసైన్యమింతవఱకు దానిని సాధించియుండును. నిర్భాగ్యుఁడగు నాసుమేరుఁడు చెఱనుండి విడిపింపఁబడి యుండును. ఎపుడైననాకు మనసువచ్చినపుడు వానినిఁ బాఱఁదోలి దాని నాక్రమించుట కష్టమా? ఉభయరాజ్యముల నీతీరుసాధింపఁగలిగిన మార్గమును, సందుకు దగినబుద్ధివిశేషమును నలవడియుండ నీ సమయము నూరక వ్రేళ్ళ సందున జాఱిపడిపోనియ్యవచ్చునా? పోనియ్యను. పోనియ్యను. రాజాధిరాజుల తలలఁ బొడిచి చరణదాసులుగాఁ

జేసి యిక్కడివాని నక్కడికి నక్కడివాని నిక్కడికిఁ బుట్టచెండులభంగిఁ ద్రిప్పులాడుచు నెందును నెదురు లేనికడిమి భూమ్యాకాశముల కంతరాళమున సూత్రములు కల్పింపఁజాలు నే నొకకుమారహతకునకై కన్నులు దెఱవని కసుగందునకై గత్యంతరము గానని నిర్భాగ్యునకై పరితపించుచు నంతరాయములఁ గల్పించుకొనవలయునా?

అనుబంధము 1

వాఁడప్పుడే కేరళమువిడిచి దాదుల వెంటఁ గూఢ భంగిదారిలో వచ్చుచుండ వలయును. చూచెదఁగాక. ఈ జ్యోతిష మెట్లు నిజముకాఁగలదో?

(నిష్క్ర—)

---

ప్రథమాఙ్కము—ద్వితీయరంగము.

—0—

(అడవి)

[ప్రవేశము: అఘోరుఁడు-బోయ (కన్నులుగట్టిన మణిమంతునితో)].

మణిమంత—అకొయ్యా! అగొయ్యా! అమ్మా అమ్మా దాదీ దాదీ!

అఘోర— వారెన్నా. రేఁమి శెయ్యాల్రా. సంపాల్నంటె యెమో ఆవుతుంది.

బోయ—అగ్గో రా! బోకిబిల్లముండా కొడుకెవ్వఁడ్రా వాడు? నిండాకనొక్కకుండా ముక్కుసొక్కనివచ్చి యెయ్యరూపాయ లిచ్చిండాడు యీపిల్లోణ్ణిసంపేకి.

అఘోర—అతప్పుడు నాకొండె కెంతిముక్కరా?

బోయ—ముక్కేడనూస్తివిరా?

అఘోర—యెన్నెట్లో గాలివచ్చిండ్లె నూడెనూస్తి.

బోయ—ఊఁకొన్రాయింఁకపోదాం. తెల్లార్తుంది.

అఘోర—నేనెమో సంప్లేసప్పా నీమంచు.

బోయ—అనోద్దెస్తాపుంటిగ్గి. యిట్లంటెయెట్లరా?

అఘోర—యెమోనూస్తా ముందుపోదాంపద.

బోయ—వాడెవడురా. తొంగేసి తొంగేసి నూస్తాడు.

అఘోర—ఔన్రా దారా. మొదట వాణ్ణిమొత్తుదాం లేకుంటెపానానికే వచ్చినీ.

(ముందుపోవుదురు. అందొక చెంచువాఁడుండును).

అఘోర—యవడవీ నీవు?

చెంచు—(ఊరకుండును)

అఘోర—నీ పేరేం. శెప్తావా తల పగల్కొత్తెద్యా.

చెంచు—(నవ్వును)

అఘోర—దబ్బరసాకొండె. (గొడ్డలియెత్తును)

చెంచు—(మూగసైగలు చేయును)

అఘోర—(బోయతో) తీయశ్శీ ఈ సెప్పమూగి నాకొండె (దూరముపోయినవ్వి)
పాపోడా! నిన్నేమి సంపెల్లేదు. అవుతే యింతపని అయినా శేయకుంటె అమునంగి నాయాలు వప్పుకోడు. (అని, మణిమంతుని కుడికాలు బొట్టనవ్రేలు కత్తరించి తీసి కొని బోయతో నిష్క్రమించు)

మణి—అయ్యో! దైవమా! నారాయణ! అమ్మా! నారాయణా!

అనుబంధము 2

[ప్రవేశము: గుఱ్ఱముతోఁ గుళిందుఁడు.]

కుళింద—అబ్బా! ఇంత దొంగపులిని నేనెన్నఁడు చూడలేదు రాత్రియంతయు నశ్వ మునఁ దఱిమిదఱిమి చాల యలసిపోయియున్నది. కాఁబట్టి యీపొదవాటికేగరా వచ్చును. ఇందేయుండి నిరీక్షించెద.

మణి—హా! నారాయణా! అమ్మా! నారాయణా!

అనుబంధము 3

కుళింద—(స్వ) ఎక్కడ? అదియెవరో బాలుఁడు రోదనము చేయుచున్నట్లున్నది!
(పోయిచూచి) అయ్యయ్యో! ముద్దుపాపని కెవ్వరీక్రూరంపుభంగి వాటిల్లఁజేసిరి?

అనుబంధము 4

(కన్నులువిప్పి) అక్కటా! ఈబొటనవ్రేలు తెగనఱికియున్నారే! పాపాత్ములు! (నెత్తురు తుడుచును).

మణి—అయ్యో! అయ్యో! (అతిభయపడును.)

కుళిం—కుమారా! భయపడకుము, నేనేమియుఁ జేయను (లాలించును).

మణి—(వెక్కి వెక్కి యేడ్చును.)

కుళింద—కుమారా! నీవెవ్వరవు? నీ పేరేమి?

మణి—(ఏడ్చుచు) మమ్మంత-మమ్మంత.

కుళిం—మమ్మంతా! ఇదేమి పేరు? హనుమంతుఁడవా?

మణి—కాదు మమ్మంత.

కుళిం—ఏడ్వకుము ఏడ్వకుము. మాయన్నా! ఏడ్వకుమా. నీ పేరేమి?

మణి—మమ్మంత.

కుళింద—అయ్యో! ఈబాలుఁడించుకయు మాటలాడఁజాలని నాలుగేండ్ల కసుఁగందువు. దైవమా! వీనికా యిట్టిపాటు? కుమారా! నీతండ్రియెవరు?

మణి—అయ్యా—అయ్యా.

కుళిం—ఔను, మీయయ్యపేరేమి?

మణి—అయ్యా.

కుళింద—ఇఁకఁ బ్రయోజనములేదు. వీని జననీజనకుల నరయు నుపాయమేలేదు. కొడుకులు లేరని దుఃఖించుచున్న నాపై దైవమున కనుగ్రహముకలిగి యీపాపనినా కొసంగినట్లున్నది. చంద్రునిఁబోలు మందహాసమువాఁడు వీఁడు. చంద్రహాసుఁడను పేరఁ బరఁగుఁగాక. వీఁడు నాస్వయంప్రాప్తసుతుఁడు. వీనినూరికింగొనిపోయి పెంచెదఁగాక

(పాపని నెత్తుకొని నిష్క్రమించును.)

---

## ప్రథమాఙ్కము తురీయరంగము.

—:o:—

(కుంతలరాజ సౌధము)

[ప్రవేశము: సుదర్శనుఁడు, కుంభీనసుఁడు, బ్రాహ్మణుఁడు.]

కుంభీనస—రాజచంద్రా! మీరిట్లు శోకించుటచే నేమిప్రయోజనము? ముందు జరుగఁదగిన విషయమున నాలోచింతము.

సుదర్శన—కుంభీనసా! నేను నాఁడే నీతోఁ జెప్పలేదా? నాకేటికో చెప్పరాని భీతి మదికిఁ గలిగె. ముఖ్యము నేను నిర్భాగ్యుఁడను. అట్టి చెలియలిని మఱఁదినిఁ బోగొట్టుకొంటిని. నాసర్వాశలమోపెట్టియున్న ముద్దుకుమారుఁడిట్లు కావచ్చునా? ఎవరెత్తుకొనిపోయిరో? ఎవ్వరికాకుమారునిపైఁ బగయో యింతైనను దెలియకున్నదిగదా? ఇందుకే నాకు మొన్నట్టి దుస్స్వప్నము వచ్చినది. నీతోఁ జెప్పుదమన్న లేకుంటివి.

అనుబంధము 5

కుంభీనస—రాజపుంగవా! ఎవరెత్తుకొనిపోయిరో యని యోచింపవలయు నేల? సందర్భములమీఁదనే యాదురాత్ముని గుఱుతింపవచ్చుఁగదా? ఆముద్దుకుమారునిపై హాని తండ్రికి విరోధియగు జలంధరుఁడుగాక పగసాధించువాఁడింకెవ్వరు? వానిగూఢచారులే యీపని చేసియుండవలయును.

సుదర్శన—సచివా! వాఁడేయుండుఁగదా?

కుంభీనస—వాఁడుగాక నేనాసుతి? ఇంతగాలోచింపుఁడు. వానిపైనున్న యాభరణముల నాశించియైనను దొంగలాపనిచేసి యుందురని మీరంటిరి. అట్లైనన్నఁటికినిలుండదు. అంతకంటె నూఱంతలగు సొమ్ములు వాసంతికపై నుండలేదే? ఆపడుచును దాదికడకుఁ బండించుకొని యుండెననియు నాకుమారుఁడు ఈ బ్రాహ్మణుఁడు దాది వీరిమధ్యమున నుండెననియు, వింటిమిగదా? సొమ్ములకొఱకు వచ్చినవాఁడు, వాసంతికను మాని యీబాలుని నెత్తికొనిపోవునా? కావున జలంధరుని భటులేయెవ్వరో వానినెత్తుకొని పోయినారు. ఇదినిస్సందేహము.

సుదర్శ—మంత్రిసత్తమా! జలంధరుని భటులైన యెడలఁ గేరళపురిఁబాసి వీరు మంగళపురికి వచ్చుదాఁక యేలవిడిచిరో యెఱుఁగరాకుండెడు.

కుంభీనస—ధరణీశపుంగవా! ఇదేమాశ్చర్యమైన విషయమని యడిగెదరు? వీరించుకగూఢరీతిగా వచ్చుచుండుటవలన వీరిచంద మింతవఱ కాభటులకుఁ దెలియకుండెఁగాబోలు, లేదా మంగళపురి ప్రాంతమున నరణ్యములు మిక్కిలిగా నుండుటవలన గూఢవృత్తినా బాలునిఁ దెగఁదీయుట సులభమని తలఁచిరి కాఁబోలు, ఎన్ని కారణములుండరాదు?

సుదర్శన—మంత్రిసత్తమా! ఎట్లైననేమి? మాబాలుఁడు మాకు లేకపోయెఁగదా? ఎవరెత్తికొనిపోయిననేమి? ఎవ్వరేమిచేసిననేమి? అయ్యయ్యో! అంటినఁబాలుగాఱుచెక్కిళ్లలేఁగందువే? అట్టివానిపైనా పగ కావలయు? ఇది యెంతటి యాసురకృత్యము!

కుంభీనస—

ఉ. ఆసురకృత్యమా యిది మహాసురకృత్యము దేవళంబునన్
వాసిగ నిద్రఁబోవు పసిబాలుని నెత్తురు కందున స్తసం
త్రాసుని నెంతయు న్నిరపరాధి భయం బదిలేక నిర్దయన్
దీసి హరించి రన్న జగతి న్విని నారమొయిట్టిచందమున్.

మహాసురకృత్యము. ఇట్టిది నేనెన్నఁడునుగని యెఱుఁగను. దాదితో సుఖలీలఁ బండుకొని యుండఁగానే దేవాలయమునఁ బ్రవేశించి నీచకృత్యుని కంటగింపంక పసిబాలుని నెత్తురుకందువును నిర్భీతిగాఁ గొనిపోవలెనన్న నేమనవలయు? అయ్యో! ఆయాసురబీజుఁ డిట్టివాఁడనిమాత్రము తెలిసి చిక్కినా యింతింతగా వానిఁ గండలు కోయువఱకు నాకూఱటగలుగదు. ఇంతరాజకమా? ఇంతన్యాయమా? ఇంత—

సుదర్శన—కుంభీనసా! మనమూరక యీమాటలాడుచున్నఁ బ్రయోజనమేమి? బాలుని మనముసాధ్యమున్నంత వఱకు వెదకింపవలయుఁగదా?

కుంభీనస—(దుఃఖించుచు) రాజేంద్రా! ఇంకేటియాస? అట్లుచేదప్పి పోయినముద్దు బాలుఁడు మఱల మనకులభించుటకా పోయినాఁడు? నాకించుకంతైన నమ్మకము గలుగదు. ఐనను వెదకించి చూతము.

బ్రాహ్మ—రాజచంద్రా! మంత్రివర్యా! నోటికిఁ బోవుకడిని నేలఁ బాఱవైచిన భంగి నానీడ నాబాలుని నింతవఱకుఁ గొనివచ్చి యిట్లు పోఁగొట్టుకొంటి. ఈ యిరువది దినములు దారినున్నపుడు బాలునేమఱకుండుటకై రాత్రులెల్ల నిద్రమాని కూరుచుండి యుంటి. ఆపాడు మంగళిపురిని దేవాలయముగదా యని మైమఱచి నిద్రించితిఁ ఇట్లైతిఁ. నే నేపోయెదను. ప్రాణమున్నంతవఱకు వెదకి సాధింపఁజూచెదను.

(యవనిక పడును)

ప్రథమాఙ్కము-సమాప్తము.






శ్రీ

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## ద్వితీయాఙ్కము ప్రథమరంగము

చందనావతిలోనొక గృహమేధియిల్లు

[ప్రవేశము: నాగరికుఁడు సదాచారుఁడను మిత్రులు.]

సదాచార—మిత్రమా! నాగరికా! ఎన్ని దినములకు నిన్నుఁ జూడఁగలిగె? నీవు ప్రయత్నపూర్వకముగా నీ చందనావతికి వచ్చుటనాపై నీకుఁగల యవ్యాజకరుణను సూచింపుచున్నదికదా?

నాగరిక—మిత్రమా! సదాచార! మైత్రియను నొక బంధమున్న నెంతదూరమున నున్నవారినైనఁ జేరఁదీయుఁగదా? నీయట్టి హితమిత్రపతంస మున్నయెడకువచ్చి గోష్ఠి కలుగుట ముప్పునియేల మూఁడునూర్లయామడలైన వచ్చుచుంటిఁగదా? సదాచారా! శాంబర దేశమునఁ జందనావతియన్న పట్టణమెట్లో యున్నదనియెంచియుంటి. ఇదెంత రమ్యముగా నున్నది. ఈ జలనాళికలేమి! ఈ తోఁటలవైభవమేమి స్వర్గపురికిఁ బ్రతినిధిగా నున్నదిగదా! నన్నింత మోసము చేయుదువా? నాఁడు భీమపురిలో మనముండిన కాలమున "మాపట్టణము రాజధానియని పేరొకటియే కాని పల్లెకొంపవలె నుండు" నంటివే.

సదాచార—నాఁటికట్లనే యుండెఁగాని నేఁటికిట్లయినది. ఈ వృద్ధియంతయు నీనాలుగేండ్లలో నయినది. నేను జెప్పినది యాఱేఁడులక్రిందట.

నాగరిక—ఈ నాలుగేఁడులలో నిట్లయినదా? ఏమి విచిత్రము!

సదాచార—మా రాజునకుఁ గొడుకులు లేరనియు, నతఁడు వేఁటకుఁబోయి యుండఁగా నందుఁ బడియుండిన నొక నాలుగేండ్లబాలుఁడు చిక్కెననియు, నతని స్వయంప్రాప్తసుతునిఁగా గ్రహించి చంద్రహాసుఁడని నామకరణమొనర్చి పెంచుచున్నాఁడనియు, నాబాలుఁడు చిఱుతదనముననే ధీరగుణోదారుఁడని నుతికెక్కెనాఁడనియుఁ జెప్పలేదా? ఆ చంద్రహాసునికిఁ బదియునాఱవయేఁట మా రాజు రాజ్యభారము మోపె. ఇప్పటికి నాలుగేండ్లనుండి యసదృశలీల రాజ్యమేలుచున్నాఁడు. ఈ పురమునఁగల సర్వసౌఖ్యములకు నతఁడే కారణభూతుఁడు.

నాగరిక—అట్లనా! అతని దర్శనము నాకు లభింపఁగలదా?

సదాచార—అయ్యో! మిత్రమా! దీనినడుగవలెనా? పౌరులగు వారా రాజన్యుని సందర్శించుటకుఁ గాలనియమముగాని సేవకాళి యభ్యంతరముగాని కలుగదు. నిదురపోవుచున్నను సరియే. భుజింపుచున్నను సరియే. మధ్యాహ్నమైనను సరియే. అర్ధరాత్రమైనను సరియే. అంతయేందుకు ? నీవీమాటనాడితివికదా అతని గూఢ చారుఁడెవఁడైన వినియెనా, యతఁడే నీ యభిలాషమునుదీర్ప మన యింటికివచ్చినను రావచ్చును.

నాగరిక—అట్టిమహనీయుఁడా? అయిన మనము భుజించిన పిదపఁ బోవుదము. నేనించుక వెలుపలికిఁ బోయిరావలయు. నేను దెచ్చియుండిన పొగచుట్టలు వ్యయమయినవి. అంగడి వీధికిఁబంపి తెప్పింపుమా.

సదాచార—నాగరికా! క్షమింపుము. ఈ యూర నయ్యవి దొరకవు. సత్కర్మ నిరతుఁడై సత్సంప్రదాయ తత్పరుఁడై రాజ్యమేలు రాజన్యు వీట నిట్టి దుష్టములును నప్రయోజకములు నగుపదార్థములుండవు.

నాగరిక—ఏమాశ్చర్యమిది? పొగాకైన నుండునా లేదా?

సదాచార—మందునకైన, వాసనఁజూడనైనఁగలుగదు.

నాగరిక—నస్యము వేయువారు, చుట్టలుఁ ద్రాగువారు, వీరిగతియేమి?

సదాచార—అట్టివారున్న వారికి దుర్గతియే. నస్యము వేయువారిని హాస్యముచేయువారున్నారు. పొగచుట్ట చేఁదువారిని బిగఁబట్టి మోదువారున్నారు.

నాగరిక—ఇదే మసాధ్యరాజ్యమే! ఇంకఁ బొగాకునకే యిట్లున్న, బంగి, నల్లమందు, కల్లు, సారాయి, వీనికెట్లు ?

సదాచార—సరిపోయె. భంగి దుర్భంగియే. నల్లమందు పిల్లమందే. కల్లుపొల్లే. సారాయి యన్నఁ బోరాయందురు. ఈ పదార్థముల మే మెఱిఁగి మూఁడు సంవత్సరములాయె.

నాగరిక—ఇట్లయిన నసాధ్యము.

సదాచార—ఊరకుండుము. నీపుణ్యము. ఇట్టి క్షేమరాజ్యమెందైనఁగలదా?

నాగరిక—కానిమ్ము, నాకేమిపట్టినది? మిత్రమా! నేనిందు ఱేఁపాకనాఁడే యుండుటకు వీలుకావున నీమధ్యాహ్నమున రాజదర్శనమైన పిదపఁ బురసంచారము గావింపవలయు. సాయంకాలమున నేమిచేయవలయు? మఱచితి. ఈ యూరసంగీత పాఠకు లెవరైనఁ గలరా?

సదాచార—ఎందఱో కలరు వినివత్తము.

నాగరిక—వారేమి పురుషులా? స్త్రీలా?

సదాచార—ఆకడమాటనకుము.

నాగరిక—ఏమీ! ఇందుభోగమువారేలేరా?

సదాచార—రోగములు పుట్టులుగనున్న భోగముదిట్టలెల్లఁ బరిత్యాగముఁబట్టిగాని, విరాగము పుట్టిగాని నాకభోగముల ముట్టిరి.

నాగరిక—అట్టియైన నిందున్న చిరబ్రహ్మచారులకు విధురులకు, విటులకుగతియేమి?

సదాచార—మంచి మాటడిగితివి చిరబ్రహ్మచారులు హరబ్రహ్మవిహారులు కారా? విధురులు వనితాంతరభోగవార్త బధిరులైరి. విటులన్న వారెట్లుందురు? మీసీమ నట్టివారున్నారా?

నాగరిక—ఇంకఁజాలును మీప్రభావము. పాపము వెలయాండ్రనుఁ బురివెడలఁగొట్టుట వలన నీరాజునకేమి ఫలము?

సదాచార—అయ్యో? ఎట్టిభ్రాంతి! వారిని బురమెవ్వరు వెడలఁగొట్టిరి. సత్ప్రవర్తనాపారీణులై జనులెల్ల వారిఁగన్నెత్తియైనఁజూడక నాట్యాదులకు రావింపక నిరాదరణమొనరింపవారే యుండరామి గలిగి మీయట్టి సత్ప్రభువులుగల యూరులకుఁబోయిరి.

[ప్రవేశించి-ఉప్పరవాఁడొకఁడు ఉప్పోయమ్మ! ఉప్పో]

సదాచార—ఓరీ! యిందురమ్ము! మాయింటఁగావలయును. ఉప్పెట్లిచ్చితివి?

ఉప్పర—నూటయిరువది కొలారములయ్యా.

సదా—అదేమి? పదికొలతలు తగ్గించితివి?

ఉప్పర—అయ్యో! ఎక్కడఁజూచిన వాన. ఓడలలో నుప్పెనిలువదు.

సదా—కానిమ్ము. లోపలికిఁబోయి యడుగుము.

ఉప్పర—(లోపలికిం బోవును.)

నాగ—మిత్రమా! ఎంతకు నూటయిరువది కొలారములు?

సదా—రూపాయకు.

నాగ—కొలారమెట్టిది?

సదా—ఇట్టిది. (కొలతచూపును)




నాగ—(ఎదకొట్టుకొని) నేనేమి స్వప్న రాజ్యమున నున్నానా లేక నేనే స్వప్నములో నున్నానా? అయ్యో! మీయూర నుప్పింతచౌక యెట్లాయెను?

సదా—ఇదేమి? చౌకయనియిట్లాడెదు? మనమున్న జగమువంటి జగములఁ బదింటినైనను దనజలరాశియందు ముంచఁగలసముద్రుఁడు ఏద్రవ్యములేక బీదసాదలకును, గొడ్డుగోదలకును, ప్రాణాధారముగావలసిన వారందఱికిఁ దనివి దీఱునంత క్షారోదకమివ్వనుండ, నిది చౌక యెట్లగును? ఉప్పుచేసిమోసితెచ్చు కూలియేకదా మన మివ్వవలయు? అయిన మీసీమ నిది యెట్లిత్తురు?

నాగ—దీనిలోఁ బండ్రెండు కొలతలివ్వ వచ్చును. అందుకే యిట్లాడితి.

సదా—పన్నెండు కొలతలు? పండ్రెండు కొలతలా!

నాగ—ఔను. కారణమునే చెప్పెదను. నాప్రశ్నకుత్తరమిమ్ము. మీచంద్రహాసు రాజ్యమున నుప్పునకుఁ బన్ను కలదా? లేదా?

సదా—ఉప్పునకుఁబన్ను! ఉప్పునకు పన్ను! ఉప్పునకాప్పను! (భ్రాంతితోఁజూచును)

[ప్రవేశము: కొట్లాడుచు అపేక్షకుఁడు, ఆత్మప్రియుఁడు.]

అపేక్ష—నీవేమైనను జెప్పుము, నేనువినను. నాకాల్వఁబూడువను నీకుధైర్యమెట్లు కలిగె? నన్నేల యడుగ వైతివి?

ఆత్మ—నాపళ్ళెంతయు జలమయ మగుచుండఁగాఁ జూచియూరకుండు మన్నావా? నీకాల్వ పూడినఁబీడవీడినది.

అపేక్ష—నాకాల్వ పూడినఁబీడవీడెనా? నీయుసురూడిననాకుఁబీడవీడదో? కట్టికొనుము. ఎవ్వరిపీడవీడునో చూచెద.

ఆత్మ—సిద్ధము రమ్ము. కీడుమూడునో! పీడవీడునో! కాడుమాడునో!

ఇరువురు—(కొట్టుకొనుచుఁ గిందుమీఁదగుదురు).

సదా—(దిగివచ్చి) అయ్యో! అయ్యో! తాళుఁడు. తాళుఁడు. (అనియెంత చెప్పినను వినక పిడిగ్రుద్దులాటలాడెదరు. తుదకు) ధూర్తులారా! మీకుఁ జంద్రహాసు నాజ్ఞ కలదు.

అపేక్ష—ఆత్మ(కొట్టులాడుటమాని యొకరినొకరాలింగనము చేసికొని) సోదరా! క్షమింపుము. మనము మిత్రులము పోయివత్తుము (అని ఒకరికొకరు నమస్కరింతురు.) (నిష్క్రమింతురు)

సదా—(తన స్థానమునకు వచ్చును.)

నాగరిక—అబ్బా! మీచంద్రహాసుని దర్ప మెంతవచ్చును?

[ప్రవేశము: రాజభటుఁడు.]

భట—సదాచారా! చంద్రహాసరాజుగారు నినుఁ దోడ్తెమ్మన్నారు. మీయింటికిఁ గ్రొత్తగా నెవరో వచ్చియున్నారే వారినిరమ్మన్నారు. మీకు రాఁదీఱకున్నఁ దామె యిప్పుడే వచ్చెదమన్నారు.

సదా—ఇపుడే వచ్చెదము. (భట నిష్క్రమణము)

నాగ—ఇదేమాశ్చర్యము! రాజచంద్రుని కీవృత్తాంతమెట్లు తెలిసెను?

సదా—అతనిగూఢచారులు సంఖ్యాతీతులు పోవుదము రమ్ము.

నాగ—(లేచుచు నందున్న వెండిచెంబుచేపట్టును.)

సదా—దానినేలగైకొనెదు? అందు పడియుండనీ.

నాగ—ఈవీధి నిట్లు దీనివేసిననెట్లు?

సదా—ఇంతయేనా చంద్రహాసరాజు ప్రభావము! చౌర్యమన్న మాట యీండెఱుఁగము వలసిన పదార్థమువలసినచోట వేయుము. పోవదు. పోదము లెమ్ము. (నిష్క్ర).

---

## ద్వితీయాఙ్కము

### ద్వితీయరంగము-కుంతలరాజు నగరు.

[ప్ర॥ సుదర్శనుఁడు, కుంభీనసుఁడు, చంద్రహాస సుభటులు.]

భటులు—(చంద్రహాసుఁడు కానుకగాఁ బంపిన యమూల్యాభరణములు మొదలగు పదార్థములనర్పణముచేసి )

ఏలికా! మాచంద్రహాస మహారాజు దేవరయడుగుందామరలకు బత్తితో మ్రొక్కితి నని విన్నవింపుమన్నాఁడు. దేవరకూరిమి గలుగఁ దనకేమియుఁ గొదువగలుగదని విన్నవింపుమన్నాఁడు. ఎల్లప్పుడు దేవరయానతి నౌఁదల మోసికొని నెఱవేర్చువాఁడ నన్నాఁడు. పొడుపుగుబ్బలిమొదలు గ్రుంకుమెట్టుదాఁక మంచుకొండనుండి సిరిచందపు గుబ్బలి వఱకు నెడములేక నిండియుండు దేవర యశమునీడఁ దానొక మానిసినైతినన్నాఁడు. ఏకిమీఁదా! పరాకు.

సుదర్శనుఁడు—భటసత్తమా! మిక్కిలి సంతసించితిని. మీకులిందుఁ డిప్పుడు సమధిక సంతోష యుక్తుఁడై యున్నాఁడనుటకును నాకు మోదముగలిగెడు. ఇప్పుడు మీచంద్రహాసుని రాజ్యము చక్కఁగ నున్నదా?

భట—జియ్యా! ఆయెకిమీనియేలుబడి కడుచల్లనిదని ప్రజలందఱు నుగ్గడింతురు. తెంకల నెల్ల నెయ్యురంబోలెఁ జూచుచు వారిసేమమే మీసేమమని తలపోయుచు వచ్చికడలఁ జేరెన్నికకలుగు కైవడిపజలఁ బ్రోచుమీముందఱ మాయేలిని నగ్గింప నేఁ జాలువాఁడఁ గాను. అయినను, సాహీబూ! నీవైచనవిచ్చుటఁ బలికెదను. మారాయఁడు దేవర తెంకలకెల్ల వన్నెదెచ్చువాఁడు.

సుదర్శన—సుభటా! మిక్కిలి సంతసించితిని. ప్రజాపాలి తృప్తిపొందులీల రాజ్యమేలు వాఁడు గలుగుటరిది. కావున మీరాజుతో నాకెంతయు నాహ్లాదము గలిగెనని చెప్పుము. మీకులిందకుని క్షేమమునడిగితిననుము. మైత్రిఁబాయక యుండుమనుము.

భట—జోహారులు. (నిష్క్రమింతురు.)

సుదర్శన—చూచితే! సచివా? ఆకులిందకుని దెంత పుష్టరాజ్యముగా నున్నది? ఈవత్సరము నాకతఁడు పంపియుండు పదార్థము లమూల్యములు.

కుంభీనస—రాజేంద్రా! నాకువిశ్వాసము కలుగదు. ఆకులిందకుఁడు ధర్మభంగిరాజ్య మేలుచున్న వానికిట్టి పదార్థములు గలుగఁ జాలవు. మన్నింపుఁడు. వానిభటులు చెప్పిన మాటలపైననే మనము నమ్మవచ్చునా? అందేమో జరుగుచున్నది. మమ్ముఁ గన్నులుమూయుటకును, ఆయధర్మముల వెలికి రానీయకుండుటకును నిట్టియమూల్య వస్తువులఁ బంపియున్నాఁడు, కాని యితరము కాదు.

చ జనములకెట్టిబాధలు విశంకతఁ జేసెనో దుష్టకృత్యముల్
పనుపడి యేమొనర్చెనో కో వానిని బాహిర పెట్టుకుంటకై
కనుమఱఁగింప మమ్మునిటు కష్టములంపె నమూల్య వస్తువుల్
మనకటుగాక లేనిబహుమాన మొనర్చుటనేఁడునైజమే.

సుద—కుంభీనసా! నాకుఁజూడఁగానీవుజగము నంతయు వేలుకంట నేచూచునట్లున్నది

కుంభీనస—అయిన చిత్తము. నాదేమిపోవును? తేపు ప్రాణముపై వచ్చినపుడుగదా కుంభీనసుఁడు కావలయును?

సుద—కుంభీనసా! కోపగింపకుము. నేనూరక యంటిఁగాని నీకు మనసురాకున్న నామాటాడియుండను. క్షమింపుము.

కుంభీనస—అయ్యో! ఇటుకలదా? నాకెన్నఁటికైనఁ గోపముగలుగునా? నేనెవ్వరిపైఁ గోపగింపవలయు? ననురక్షించు నేలికపైననా? నను గాపాడు తండ్రిపైననా?

ఉ. చెన్నగుఁ గోపమంచనినఁ జెప్పెడిదేమిఁకఁ గోపమేరిపైఁ
బిన్నటనాటనుండి ననుఁ బెంచి దయామతి నాదరించి య
భ్యున్నతినించి సంపదలముంచి భరించినవానిపైననా
యెన్నఁగనాదుకోప మిటులేని ధరిత్రిని నుండువాఁడనే.

నిక్కముగా నేనుజగమును వేలుకంటఁ జూచుట పైచూపువలనఁగాదు లోని చూపువలన. ఈ కుళిందకుఁడు మనకుఁ గీడుదలఁచి యున్నాఁడనుట కింతకంటె వేఱు నిదర్శనము లేదు.

సుదర్శన—కుంభీనసా! ధీవిశేషమున నీకెప్పుడు నేనెడమియ్యవలయు. నీవన్నమాట యదార్థమే యుండవచ్చును. ఇదెట్లుపరీక్షింపవలయు?

కుంభీ—నీచరణదాసుఁడ నేనుండ యోచింపవలయునా? నే నేపోయి పరీక్షించివత్తును.

సుద—అట్లయిన నవశ్యముకానిమ్ము.

కుంభీనస—నాకుఁ గుళిందకుని సింహాసనచ్యుతుఁజేయుట కధికారపత్రికయిమ్ము.

సుద—అదిప్పుడేల?

కుంభీ—అదియుఁ జెప్పవలయునా? నేఁబోయియందు విచారింతును. అంతయుఁ జక్కఁగ నేయున్న నూరకయేవత్తును. ఏదేని యపాయమున్నట్లున్న మించిపోవక ముందే యాపనిఁ గావింతును.

సుద—నీయిష్టము వ్రాయించియిత్తును. అయినఁ దొరపడి యట్టికార్యమును మాత్రము చేయకుమా?

కుంభీ—దానికై మీరు భయంపడవలదు. నేఁబోయివత్తును.

సుద—మఱచితి. నీవుతొల్లి నిచ్చటికి వచ్చినప్పుడు నాతో నేమియో విశేషవృత్తాంతము మాటలాడవలయునని వచ్చితి నంటివి. ఇంతలోన నీకుఁ జీరుమని కానుకలు వచ్చినందున నాప్రస్తావము మానితిమి ఏమి కార్యము?

కుంభీ—రాజచంద్రా! ఒకవిషయమున నాకేమియుఁ దోఁపకున్నది. నీకుఁగూఁతురును, నాకుఁగొడుకును గలుగక ముందు మనము సంబంధులము కావలయునని వినోద సంభాషణము చేయుచుంటిమి. అప్పటికది హితమని తోఁచెనుగాని పిదప నాలోచింపఁగా నట్లు ఘటిల్లుట నాకును నీకును నపకీర్తికి హేతువని తెలిసితి. తెలిసి గాలవునితోఁ బదునేను సంవత్సరములకుముందే యీవిషయము వచించితి. పుట్టిననాఁటనుండియు ననుంగుపైపోఁడువలెనున్న నీమాటతో ముదునా లేక యపకీర్తిపాలౌదునాయని యోచించుచుంటి. ఒకనాఁడు నీవు నాతోఁడ నీకూఁతును నాకిచ్చెదనని నీపుత్రిక దౌహిత్రుని కివ్వఁ దలంపుగొనిన చందము చెప్పఁగా నా ... ల్లితిని. నాతలపైనున్న భారము దీఱెనని సంతసించితిని. నాదౌర్భాగ్యమునఁ నసురులచే నాముద్దుకుమారుఁడు చిక్కి పదునైదు సంవత్సరములైనను గానరాకున్నాఁడు. వానికై నీకుఁజెప్పక నేనెంత పరితపించినదియు, నెంత కార్యము చేసినదియు నాదైవమునకే తెలియును. ఇప్పుడు భీమపురమునున్న మాసంబంధులు తమ దుహితను నాసుతుని కివ్వఁ దలపడి మిక్కిలి నిర్బంధించిగా జెప్పనంపియున్నారు. ఇంకఁ పెదయఁబాలుమని మాటనంపియున్నారు. వలదందునా వారికి లేనియాగ్రహము గలుగును. కానియ్యందునా చిన్ననాఁటనుండి నేఁజెప్పుచున్న మాట వీటఁబుచ్చితినా అని నీవందువేమోయని భీతిల్లెద. కొడుకన్ననో యిరువదిరెండేఁడులవాఁడాయెను. ఏమియుఁ జేయనేరకున్నాఁడను. ఎట్లయిన ననుగ్రహించి నాకొడుకునకు నాయిష్టము గలవారితో వివాహము సేయ నాకనుమతి యియ్యవలయునని ప్రార్థించెద. నాయీసంకటము భంగి గనక కరుణింపవేఁడెద.

(నమస్కరించును.)

అనుబంధము 6.

సుద—కుంభీనసా! లెమ్ము లెమ్ము. నీసువిచారమునకుఁ బరమానందము వహించితి. నీయట్టివానితో సంబంధము తపఃఫలమునఁగదా లభింపవలయును? అయిన నింతమాత్రము నాప్రార్థన మొనరింపవలయు.

తే. గీ. మంత్రిసత్తమ మామణి మంతువగిదిఁ
దెలియనంబాఁక యొక్కింత తలఁపుమయ్య
సచివయొక్కైన నాఁడు మాసములనఁడు
నీ కుమారుని పెండిలి నిలుపుమయ్య.

నాచెలియలిపైనున్న నాప్రేమకై యామెను లేపండుటవలన నామె కొడుకునకు నాతనయ నిచ్చ నెంచియున్నాను. ఆ మణిమంతకుమారు నరయుటకుఁ బోయియున్న కేరళబ్రాహ్మణుఁడు మూఁడునెలల క్రిందట వ్రాసినజాబుఁ జూచితివిగదా? మూఁగతనము గలిగియున్న నొక చెంచువానివలన నొక్కింత వృత్తాంతము తెలిసినదనియు, నింకను విచారించుచున్నాననియు వ్రాసెను. అదియేమి దైవాయత్తమో, లేక నాయభిలాష విశేషమో, నీవెంత నిరాశచెప్పినను నామణిమంతుఁడు నాకుఁ జిక్కవచ్చునని తోఁచుచున్నది. కావున నెట్లయిన ననుగ్రహించి యింకొక యాఱునెలలు నీకుమారునకుఁ బెండ్లి గావింపకుము. అంతలో వాఁడు చిక్కకున్న నిను నిర్బంధపెట్టియైన నాసుత నొసఁగెద.

కుంభీ—అయ్యో! నా కాయభిలాష మేలేదే. మీరేల యిట్లు నిర్బంధపెట్టెదరు?

సుద—ఇంకొండాడకుము. నామైత్రి నాఁదియింత పాలింపుము.

కుంభీ—భాగ్యము. (నిష్క్ర.)

———o———

## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

కుం భీ న సు ని యి ల్లు.

[ప్రవేశము: కుంభీనసుఁడు విషయ.]

కుంభీ—విషయా! ప్రియతనయా! నీవిట్లొనర్పకున్న విధిలేదు. ఆమాధవుఁడు వయసున నింత మీఱినవాఁడేకాక గుణమున రూపమున మిక్కిలి యెక్కుడగువాఁడు. తనయా! కన్నకూఁతురుల మంచిచోట్లఁ బెండిలిచేసి యిచ్చుటకంటెఁ దండ్రులకు వేఱొక చింతగలుగునా? నామాటత్రోయక పాటింపుము.

సీ. చంచలత్వముమాని మించుగాధనలక్ష్మి
తవిలివానింట తాండవముసేయు
నొదవియుండెడునందు మదపుటేనుఁగులన్న
బలుతురంగములన్నఁ గొల్లదిమీఱి
వనితలుపెక్కులైయును బిడ్డపాపల
జంజాటమెఱుఁగని జనవిభుండు
ప్రాకటమతిఁ దనరాజ్యభారమునీకె
చెన్నారనర్పింప నున్నవాఁడు

గీ. సర్వసుఖములఁగనవయ్యె నుర్విమేల
నయ్యె నిదియెంతభాగ్యమయ్యారె తనయ
యట్టివయసున నింతెక్కువైన నేమి
మాధవుండన్న రెండవమాధవుండు.

## అనుబంధము 7.

విషయ—అయ్యో! నీమాట నే జవదాఁటుదానా? అయినను నాయభిలాషము నీవడుగ నుత్సహించినందున నింతమాటాడ సాహసించెదను. ఇది నీకెంత యభీష్టముగానున్నను నాకు మదికలుగదు. రాజ్యము నాకుఁ గలుగుఁగాయని నీవాలోచించినట్లున్నది. మనసురాని సురరాజ్యముకంటెను మనసుకలిగిన దరిద్రభంగియయిన మేలగుఁగదా? ఎట్టి బీదవానికైన నన్నొసంగుము. వలదనను. నాకు రాజ్యము మేలుమాత్రమని యా చోటికియ్యకుము.

## అనుబంధము 8.

కుంభీ—కుమారీ! ఎన్నెన్నిచోట్లనో విచారించితినే నీకనుకూలవరుని. ఎందునుఁ జిక్కకున్నాఁడు. నేనేమిచేయుదును. నీవు పసిదానవు. కావున నిట్లాడెదవు. రాజ్యమన్న నూరక వచ్చునా? ఈలోకమున జనించుటకు ఫలముభోగము లనుభవింపనేకదా? నాకంటె నీక్షేమచింతయందు నీకెక్కువగాఁ దెలియునని నమ్మితివా? నీకుపదేశింపఁగోరి నిన్నడుగుటయే కాక వలయునని నేఁబట్టుపట్టిన నీవద్దనూరకుండగలవా? ఊరకియ్యకొనుము. నీవెఱుఁగవు. నేను జాబువ్రాయఁ బోయెద. (నిష్క్ర—)

విష—అయ్యో! మాయయ్యకేమి భ్రాంతికలిగియున్నది? ఎనుబదియేండ్లు మీఱవచ్చిన ముదివగ్గునకు నన్నివ్వ నెంచియున్నాఁడే? ఇట్టిదుఃఖ మెందైనఁగలదా? నాకుఁ బరిణయము కావలయునని మొఱవెట్టికొంటినా? ఏల పిట్టపిడుగున నిట్టి తలంపు గలిగినాఁడు? రాజ్యము నాకు లభింపవలయునని యాశించినాఁడు కాఁబోలు. అయ్యో! రాజ్యమా! ఆరాజ్యమున నేమిసుఖము లనుభవింపవలయు. రాజ్యమునా నన్నుఁ బరిణయ మాడుమనుచున్నాఁడు? మాతండ్రియా కడుమంకురము గలవాఁడు. పట్టినపట్టు తప్పక సాధించువాఁడు. నేనేమిచేయుదును. ఎవరు నన్ను రక్షించువారు? కన్నతండ్రియే నను విక్రయింపఁ దలఁపుగొన్న నాఁపఁగలవారెవ్వరు? దైవమా! నన్నేమి చేయనెంచితివి?

## అనుబంధము 9.

అక్కటా! తండ్రియగుఁగాక దైవమేయగుఁగాక నాకేమి పుట్టుకొఱ్ఱయుఁ జేయుదు మన్నఁ జేయుదునా? అంతవిధిలేని సందర్భము వచ్చినపుడు విషముండెదనా? (నిష్క్రమించును.)



[పునః ప్రవేశము. కుంభీనసుఁడు, మదనుఁడు]

కుంభీ—మదనా! అదియేమి సంతోషోదంతము చెప్పినను వలయునంత మాఱకున్నావు?

మదన—జనకా! నేనేమియు మాటాడఁజాలకున్నాను.

కుంభీ—అట్లనా? ఎందుకు? సంతోషముననా?

మదన—ఏమయిన ననుకొనుము. పోనీ, రాజిందుకు సమ్మతించెనా?

కుంభీ—ఇదేల యిట్లడిగెదవు? ఇరువదిరెండేఁడుల కొడుకవయ్యు నీతండ్రి సామర్థ్యము నూహింపఁజాలవా? నాకభీష్టమైన కార్యమునకు నీ మదిరాజు సమ్మతి యొకటి కావలయునా? అప్పుడే చెప్పితినే! ఇంకొక యాఱునెలలవకాశము మాత్రము కోరి నాఁడని, నేనిచ్చితిని.

మదన—అవును, కానిమ్మిప్పుడేల? యింకను నాఱునెలలున్నదికదా?

కుంభీ—ఓరి నిర్భాగ్యుఁడా! ఈ యాఱునెలలలో జగత్ప్రళయము కాఁగలదని యెంచెదవా? అదిగాక నీచందము నాకుఁదెలియదనే తెలియదు. భూరిరాజ్యముతోడ రాఁగల రాచకన్నియ నినుఁ జేపట్టుటకు వలయు సన్నాహములు నేఁ జేసియుండఁ గొంచమైన సంతసించినభంగి ముఖభావమువలనఁ దెలుపక యుపేక్షించుచున్నావే?

మత్త. ఓరి సిగ్గొకవించుకంతయు నూహ సేయఁగఁజాలనే
భూరిరాజ్యము నిచ్చుబంగరుబొమ్మ ముద్దులగుమ్మనీ
దారగాఁ ఘటియింపఁ జాలినతండ్రి నించుక మెచ్చవే
గారవింపవె సంతసింపవె కారణంబది యేమొకో.

నీరోగమైన నేమి?

మదన—అయ్యా! నన్నపరాధిగా భావింపక వాత్సల్యత మన్నింతువేని మదినున్న యాశయము వెలుపలనిర్భీతిగా నాడుటకు నీకభయదాన మొసఁగుదువేని వచించెద.

కుంభీనస—నీయాశయము నాశనమాయె. అదియేమి వచింపుము. నాయభీష్టము గాంచక నీవింకెవ్వరినైన—

మదన—తండ్రీ! క్షమింపుము. నన్ను నీవెంతదురాత్ముఁ డెంతయవిధేయుఁ డనితలంచినను నీచరణములపైఁబడి క్షమింపవేఁడువాఁడ. నాసర్వైహికాశలు నిష్కపటముగా నింకొకరిపై మోపెట్టియున్నాను.

కుంభీనస—ఎవ్వరిపై?

మదన—వాసంతికపై.

కుంభీనస—ఏసంతిక?

శ్రీ

# అభిజ్ఞానమణిమంతనాటకము.

తృతీయాఙ్కము-ప్రథమరంగము.

———;o:———

చందానవతిలో కుంభీనసుని విడిది.

[ప్రవేశము: కుంభీనసుఁడు ఏకతమున.]

కుంభీ—ఆహా! ఏమియీ చందనావతీపురిసొంపు? ఇదినాకన్నులు చల్లసేయుకొలఁది కడుపున దావాగ్ని పుట్టుచున్నది. ఇంతవైభవమెట్లుకలిగె? ప్రభువగు కుంతలాధిపునకైన నింతలేదే? సేవకుఁడగు నీ కులిందున కెట్లుకలిగె? ఇదియూరక యుల్లైపోవ నిచ్చినఁ బ్రమాదము కలుగు. ఈ చంద్రహాసుఁ డెవ్వఁడో వీనికెంతఖ్యాతి! ఎంత యైశ్వర్యము? తలఁచుకొన్నంతనే సంతాపమును జూచినంతనే నిర్భర దుఃఖమును కలుగుచున్నది.

ఉత్సాహావృత్తము.

అతిశయంబు నతిభయంబు నావహించెఁ జందనా
వతి చెలంగె మతికలంగె వనట పొంగె పిసని
గతినయీరెహితము గోరుగతిని నూరకుండినన్
వెతలఁబోదు మతముగాదు హితముకాదు చూచెదన్.

ఏదేని యొక కారణమున వీని రాజ్యచ్యుతునిఁ జేయవున్న మోసమగును.

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవ—మంత్రిసత్తమా! కులిందక రాజన్యుఁడు కుమారునితో విచ్చేసి దేవరయోలగ మపేక్షించుచున్నాఁడు.

కుంభీ—(లేచిపోయి కులిందకుని జంద్రహాసునిఁ బిలుచుకొనివచ్చును.) రాజచంద్రా! నీ రాజ్యమువంటి క్షేమరాజ్యమును నేనెన్నఁడును జూచియెఱుఁగను. నీ ప్రజలెంత తుష్టులైయున్నారు! పురమునకెంత సౌకర్యము కలిగియున్నది! కన్నుల కానందముగా నున్నది.

కుళి—సచివోత్తంసమా! ఇదియంతయు మన యేలికయగు సుధర్ముని యనుగ్రహముకదా? నీ సన్మంత్రమహాత్మ్యమున బ్రకృతిజనులం జల్లనిచూపుచూచు నా సుధర్మున రాజన్యుం బోలిన చల్లనియేలిక కలిగియుండ మాయట్టి భృత్యులకేమి కొఱంత?

కుంభీ—రాజవతంసమా! ఇచ్చటి వృత్తాంత మా భూమాధవుండు నావలన వినిన నీ వినయసంపత్తికిని నీరాజ్యపాలన వైదుష్యమునకును మిక్కిలి సంతసించువాండు. కానుకలం గొనివచ్చిన మీభటులు చెప్పినంతనే నన్నుం జూచిరమ్మనిన యీ యిట్టి మహానంద వృత్తాంతము చెప్పిన నెంత సంతోషింపండు? నాకెంతయు నామోదముద్భవిల్లె. నీవొనర్చిన యిట్టి బహుమతికిని, నిట్టి యపూర్వానందకర స్వాగతమునకును నేం దగనివాండనని యెంతును.

కుళి—అయ్యో! ప్రెగ్గడా! నేనేమంత యొనర్చితిని? ఇందున నాయదియేమున్నది? అంతయు మనప్రభువు సంపదయే కదా! మహనీయుండవగు నీవు రాకరాక స్వామిభృత్యాంతరునిపైనున్న ప్రేమ ప్రకటింపనుగదా విచ్చేసితివి? నీయట్టి యుదారగుణభూషణునకు నవ్యాజకరుణాగుణపోషణునకు సర్వసత్కారము లొనరింప నాకు సాధ్యమా? ఎట్టి లోపములున్నను మన్నింపవలయు? ఇదే నాకుమారు నీకుమారుం బోలె నింకముందుం గాపాడుకొనుచు రావలయు.

చంద్ర—(నమస్కరించును).

కుంభీ—ఈ కుమారుండే నా చంద్రహాసుండు? ఎంత యన్వర్థాభిధానము. కుమారా! నిన్నుం జూడ నిర్భరానంద ముప్పతిల్లె. నీ మూండింతలు వయసున్న పెద్దలు సేకరింపం జాలని సత్కీర్తి నీ వీ యీడునకే యార్జించితివి.

చంద్ర—అమాత్యపుంగవా! కరుణాగుణభూషణుండవగు నీయట్టి విజ్ఞశిరోమణికిం గల నైజసద్గుణమున నన్ను సంతసించిన మాటలాడెదవు కాక నభోమణి యెదుట దీపమున్న చందమున నీయెదుట నేనెంతవాండను?

ఉ. ఏమని చెప్పువాండ జగదీశితమయ్యును నీసుకీర్తి సు
ధామితధీరసంపద బృహస్పతినా నుతికెక్కె నట్టి నీ
మామకబుద్ధియన్న హనుమంతుని ముందటం గుప్పిగంతు లీ
సామెతగాదె ధీసచివ చంద్రమ మాటలు వేయు నేటికిన్.



కుంభీ—ఔరా! కుమారా! నీవినయసంపద కడుం గొండాడందగినది. కుళిందకా! నీవీ కుమారునకుం బట్టము గట్టునపుడు నీదత్తపుత్రుండని స్వామికి మనవి వ్రాసుకొంటివి. ఇతండెవ్వరికొడుకు?

కుళి—సచివోత్తమా! దత్తపుత్రుండని కాదు. స్వయంప్రాప్తపుత్రుండని వ్రాసితిని.

కుంభీ—అవును. స్వయంప్రాప్తపుత్రుండే? ఇతండు నీకెక్కడ లభించె?

కుళింద—అమాత్యచంద్రమా! నేనొకానొకనాఁడు రాత్రి వేఁటకుఁబోయియుండి యలసి యరణ్యమునఁ బోవుచోఁ గూరుమండి యుండ నొకానొక బాలాక్రందనము వినిపోయి చూచుచుఁగా, ఈకుమారుఁడు షడంగుళి నిజపక్షిపాదాంగుష్ఠుఁడై రోదనము చేయుచుండె.

క॥ రాసూనుఁ డనక సనుభూ
తానూయుండనక వాసుఁ డనక కిరాతా
భ్యాసమనక కటకటయే
యాసురబీజుండు ఏసి నడఁచెనో తెలియదు॥

ఏ రాసురభీజుఁడు కన్నులు తెఱవని యీముద్దుకుమారు నట్లొనర్చియుండెనో యెఱుఁగ.

కుంభీ—(ఆతురమున) ఇది యెన్నిదినముల క్రిందట?

కుళింద—ఇప్పటికిఁ బదునైదు సంవత్సరములాయెను.

కుంభీ—ఈపాపఁ డెచ్చటఁ బడియుండెను?

కుళింద—ఇదేమి సాభిలాషముగా నడిగెదవు? నీవీకుమారు చందమేమైన నెఱుఁగుదువా? వీఁడు మంగళపురి వైపుననున్న యరణ్యమునఁ బడి యుండె

కుంభీ—సాభిలాషత యేమియు లేదు. నాలుగేండ్లపాపనిఁ గ్రూరాత్ములెవ్వారిట్లు చేసిరో యని యనుతాపమున నడిగితి.

కుళింద—నిక్కముగ వాఁడు నాలుగైదేండ్లవాఁడే. చెప్పకమును పే వయసు గుఱుతించితివి?

కుంభీనస—అదేల? వానివయసు నీవేయింతకుముందు వచించితివే?

కుళింద—వచించితిఁగాఁబోలు. వీనికిఁ బేరు సయితము చక్కఁగాఁ జెప్పఁజాలని తేఁ బ్రాయము.

కుంభీనస—పేరేదైనఁ జెప్పెనా?

కుళింద—"మమ్మ్రంత" "మమ్మ్రంత" యనియేయనసాగె. ఇప్పటికిఁ దెలియఁగఁడు.

కుంభీనస—(నవ్వుచు) "మమ్మ్రంత" ఇది యేమి పేరు. సుమ్మ్రఘుఁడని పేరిడియుండిరి కాఁబోలు నీకుమారునికి. (చంద్రహాసు నాలింగనము చేసికొని కన్నీరునించి) చంద్రహాసకుమారా! ఎంత చిన్నవాఁడవు. నీవెంతపాటు గంటివి?

సీ॥ తలిదండ్రు లెవరన్నఁ దెలియఁజాలనిరీతి
నకటశోకాబ్ధిపాలైతివన్న
కసిగందునిన్నుఁగాన నసిధారఁగోయింప
నెంచునంతటిపగ యెవరికన్న

తే. గీ. యింతయుసుజూడ కిటులాడ నెంచినాఁడ
నకటయీజాడన కేడయనఘువీడ
వలదెనీవాఁడఁ గొనియాడవలయువాఁడ
గాంచనేడ నఘమేడ కడిఁది ప్రోడ.

నీ కొలుఁబడి చల్లనియేలుబడియని జనులందఱు నినుఁగొండాడ నమాయతోడ నిన్నుఁగనని తండ్రిగావున గుళిందకుఁ డీకార్యమొనర్చియుండిన నుండవచ్చునని నమ్మితి. నీవు ధనువేల పూనవలెను? నీకు శత్రువు లెవరున్నారు? ఇదియంత నీకహితమగు భంగి నైన నంతయేల నేనే రాజేంద్రునొద్దకుఁబోయి ప్రత్యక్షముగఁ గొనివచ్చెద.

చంద్ర—పొమ్ము-పొమ్ము-తొలుతఁబొమ్ము. పోవకున్న—

కుంభి— (శీఘ్రముగ నిష్క్ర-మి.)

చంద్ర—హా! దైవమా! (మూర్ఛిల్లును.)

(యవనిక దిగజారును.)

—0—

## చతుర్థాంకము-ద్వితీయరంగము.

కుంభీనసుని యిల్లు.

[ప్ర॥ కుంభీనసుడు బిందోజీ.]

కుం—బిందోజీ! కాలసర్పములంత క్రూరములా? వాని నాకుఁదెచ్చి యివ్వఁగలవా? నేనొక మహౌషధముకై వానిఁబట్టదగియున్నది.

బిందో—వలసియున్న నీకొడుకు ఈ సంధ్యవేళకే యట్టివాటిని పదింటినిఁదెచ్చి యివ్వఁగలఁడు. విషముతీసియేకదా తెచ్చియియ్యవలయు?

కుం—విషముఁదీసినపిదప నౌషధమున కేమిప్రయోజనము? పూర్ణవిషములగునవియే కావలయు.

బిందో—ఆహా! అట్టివానినే నెట్లైనఁదెచ్చి యివ్వఁగలను కాని నీవెట్లుపట్టియుంచెదవు?

కుం—ఒక సంచిలోనుంచి యుందునని చెప్పితినే? అట్లొనర్పరాదా?

బిం—ఉండవచ్చుగాని వానిని వెలికిఁదీయుటయే యసాధ్యము. మూతవిప్పిన వెంటనే యుద్ధమువచ్చిన వారిఁ గఱచిచంపును.

కుం—అట్లు కాదు నేనొక గదిలో నింతగండి చేసి యాగండియందు దానినుంచి వెనుకటి సూత్రములనీడిచి లోపలికిఁద్రోసి భస్మము చేసెదను.

బిం—అంతయేల? నే నేపలయునన్న వానిఁదెచ్చి నీయిష్టమువచ్చినచోట వైచెదనే?

కుం—అట్లయిన గోరోచనయుండెనా? అదియొక కాలము గుణాతిరించి పక్వము మాంచి యొవ్వరు నెఱుంగకుండ వేయవలయును.

బిం—అట్లయిన దేవరచిత్తము. నే నేమో స్వామియాన జరుపువాఁడను. దానియందసాయమైన నేను తగవాదిని గాను.

కుం—ఆవిషయమున నీ వేమియు భయపడకుము. నాకు మాత్రము భయము లేదా? పోనీ! బిందోజీ! అట్లు గండిలోనుండి వేసినకాలమున నాగదిలో నెవ్వరైన మనుష్యులున్న నెట్లు?

బిం—అయ్యయ్యయ్యయ్యయ్యయ్యో! బ్రదుకునా?

కుం—కాఁబట్టి మిక్కిలి జాగరూకతతో చేయవలయుంగదా?

బిం—అడుగవలెనా? మఱి నేను పోయివత్తును. మీకీసాయంకాలమున కెన్ని కావలయును?

కుం—నాలుగింటికిఁ దక్కు లేకుండ కావలయును. సాయంకాలముకే. కావలయును మఱువకుము. తప్పకుము.

బిం—అయిన పోయివత్తును. (నిష్క్రమి.)

కుం—ఇంక నాగేంద్రవాసుఁ డెక్కడనుండునో చూచెద. అహహా! నాయల్లుఁడే. బిడ్డమగఁడే. వాఁడుపోయిన నాబిడ్డ విధవయగునే. ఆ దుఃఖము కలకాలము చూడవలసి వచ్చునే. దీనికెట్లు చేయవలయును? ఊఁహూఁ నేవినను. నేవినను. ఓయంతస్సాక్షీ! నన్నిట్లేల కళవళింపఁజేసెదవు? నాపట్టినపట్టు విడుచుట నాజాతకమున వ్రాయఁబడనేలేదు. ఈ మణిమంతుఁ బోనిచ్చుటకుఁ గంకణముపూనితి. అభాగ్యుఁడు కృతఘ్నుఁడయ్యె నాశకలత్య్య మసార్థకమయ్యె. కొడుకు శత్రువయ్యె. అయినను మించిపోయిన దేమి. అవశ్యము నాప్రతిన నెఱవేర్చెద. విడువను-విడువను. అల్లుఁడు! అల్లుఁడు! కనలేదు-పెంచలేదు. అరణ్యమునఁబోవుచునంట నఱుకఁబడియుండెనట తాఁదెచ్చి గొన్నాళ్లు సంరక్షించెనఁట-అట్టికులిందకుని కేవి యభిమానముపూని వానిఁ జంపను లేదు-నఱుకను లేదు. రాజ్యచ్యుతునిఁ మాత్ర మొనరించినంతనే పూజనీయుండ నైశ్వర్యుఁడనైయున్న నన్ను నీచాతినీచములగు నిష్ఠురోక్తులాడినవాఁ డల్లుఁడా? నిష్కారణుఁడగు భిల్లుఁడుగాక. వానికై యింకేల చింతింపవలయును? బిడ్డ! మంటిగడ్డ! ఎట్లును నేను దానినొకవృద్ధునకట్టా సుతునికివ్వ నెంచియుంటి. అచిరకాలముననే విధవగా నొనర్ప నెంచియుంటి. ఇప్పుడునట్లే కాఁగలదు. లోపమేమి? అదిగాక నేవిచారింప నీదుర్జాతియే నాజాబును మార్చినదనుట రూఢమయ్యె. "ప్రాణపీడన

మని" వ్రాసినందున "బాణిపీడవ"మని మార్చఁబడియెఁగదా? యీణికారమునందు గుడి (ఇత్వము) దానిచేవ్రాలు పోలిక నేయున్నది. జనకుఁడవు పక్షపాతమింతైనలేక జాబువిచ్చి యనర్థముగమార్చె యాజనకునాజన్మవిరోధిని పలుగాకిఁదాఁ బెండ్లి యాడునే? ఇంత యసదృశాద్భుత పాండిత్యమునకాగరకాసి విధవయే కాఁదగి యున్నది. కుంభీనసా! నీవింకనల్లుడవు నామమును దలంపకుము. బిడ్డయను నభిమానము నెక్కి రానీయకుము. విడువుము విడువుము. కరుణయను పదార్థమే యెఱుఁగని నీకిప్పటికి గరుణఁపుమాట. కట్టితివి సీమసీమల నీవిజయతోరణములు. కొట్టితివి పరిపంథి స్తోమమడుగుపట్టి. మెట్టితివి రాజాధిరాజుల కిరీటములపై ధీవిశేషసంభావనీయముగా నీచరణయుగళము. పట్టితివి నీవైరి నేభంగినైనఁ జంపుటకు ఘోరప్రతిజ్ఞ. ఇంకశంక దొట్టనేల? వేఱుమది పుట్టనేల? దైవముఁ దిట్టనేల? నీచకరుణ చూపట్టనేల? ధీరత పోఁదట్టదేల?

తే. గీ. తనయయగుగాక తగుఁగాక తగదుగాక
సమయమగుగాక చనుఁగాక చనదుగాక
దుఃఖమగుగాక దురితంబు దొడరుగాక
వీనిఁజంపక విడువ నేవిడువ విడువ.

ప్ర॥ చంద్రహాసుఁడు.

కుంభీ—కుమారా! చంద్రహాసా! (ఆలింగనము చేసికొని) రమ్మా. చూడుమిదె నీతండ్రిని మరల రాజ్యపట్టమున నునుపనొసగిన రాజశ్రీముఖము. (ఇచ్చును).

అనుబంధము ౩౬

చంద్ర—(చూచి) శ్వశురా! నీసౌకాఙ్క్షాభావము నింతని పొగడనేర్తునే? కాలబలమున బిత్రుభక్తివిశేషమునను నిరుద్దేశముగా నేనొర్చిన సర్వాపరాధములు క్షమింపవలయు. (నమస్కరించును).

అనుబంధము 37

కుంభీ—కుమారా! లెమ్ము. లెమ్ము. నీయెడనా నాకు బేదబుద్ధి? నీదుఃఖము దప్పనాకు వేఱొకదుఃఖము గలుగునా? క్షమాపణము నడుగవలసిన వాఁడనేగదా? నిన్నింత వించినందుకు.

చంద్ర—జనకా? నాకిప్పుడే యాజ్ఞయిమ్ము. అశ్వారోహుఁడనైనే నేపోయెద.

కుంభీ—పుత్రా! అంతనీకేలతొందర? నీధీరవచనము నాలించిన వెంటనె రాజశ్రీముఖము వచ్చుటకైనఁ దడవగుఁగా యనినెనె యందున మాప్రతినిధి కాజ్ఞాపత్రము వ్రాసియొక సాదితోనుదయముననె పంపితి. ఇప్పుడిదియు మఱియొక యాశ్వికునితోఁ బంపెద.

చంద్ర—మామా! అంతయేల? నాకేమియు శ్రమగలుఁగదు. నే నేపోయెద.

కుంభీ—కుమారా! నామాట వాటింపుము. నీకింత మనస్తాపము గలుగుటకుఁ గారణము నిప్పుడు తెలిసితి. మాయింటఁ బెండ్లియయిన మూడవనాఁడు గాని తుదకు పదిదినముల లోపలఁగాని యూరివెలినున్న దుర్గాలయమునకు రాత్రి పదిగడియల పిదపఁబోయి ప్రదక్షిణత్రితయ మొనరించు సంప్రదాయము. నేనిన్నుఁ జందనావతినుండి పంపునపుడు దీనిఁ జెప్పుటకు మఱచితి. ఇదియొనర్పమిం జేసి నీకీదుఃఖము పొడమినది. మీతండ్రికై నీవింతైనఁ జింతింపకుము. నేటికే నీవివాహమై తొమ్మిది దినములైనవి. ఈ రాత్రి యా సంప్రదాయవిధి యొనర్పుము. అది మహాకఠినకార్యము. దానికెన్నియో యంతరాయములు గలుగు. ప్రదక్షిణ కాలమునఁ బెద్దపులులు వచ్చినట్లు, పాములు తేళ్ళు కనిపించినట్లు, ఏమేమో భయంకర వృత్తములు జరుగును. వానిన్నరకుగొనక నెఱవేర్ప వలయు. ఈ రాత్రి యా కార్యమొనర్చి రేఁపుదయముననే వలసియున్న పోయెదవు లెమ్ము. అయ్యో! కుమారా! నీవిప్పుడు పోయిన మా ముద్దుకూఁతురు నీవియోగము నెట్లు సహింపఁగలదు? ఆతనయతో మహోత్సవమున నీపురస్సరముగ మీపిటికిమగలు పెండ్లి యొనర్చుటమాని నిన్నొంటిగాఁబోవనిత్తునా? ఇంకను సంగతుల వచించెద నిట్లుగమ్ము. (నిష్క్ర—)

—(0)—

## చతుర్థాఙ్కము-తృతీయరంగము.

## సుదర్శను నంతఃపురము

[ ప్ర॥ సుదర్శనుఁడు చంపకమాలిని వాసంతిక. ]

సుదర్శన—తనయా! చంపకమాలినీ! మనమానాఁడు వనభోజనమునకుఁ బోయివచ్చిన నాటినుండియు నీచంద మొకవిధముగానున్నది. చెలికత్తియలతోడను జనకులగు మాతోడను జక్కఁగ మాటలాడవు. నిద్రయందూరక కలవరించెదవు. నిన్న మీజనని నిన్నెంత క్రుచ్చిక్రుచ్చి యడిగినను జెప్పవైతివఁట.

## అనుబంధము 38

అయినను నేగుఱుతించియున్నవాఁడ. కుమారీ! నీకు మిక్కిలి యనుఙ్గై తోడఁబాయ కుండిన నీవిమయ యానాఁడే వివాహిత యగుటంజేసి నీయొద్దకు రాకున్నందున నీకునట్లే వివాహమేల కాలేదని కదా యోచింతువు! నిక్కము వచింపుము.

చంపక—జనకా! నాకాచింత యేమియును లేదు. ఆ నాఁ డెందరోఁ దిరిగినందున నింతాయాసమై యింకను దగ్గకున్నదిగాక యొండొకటి కాదు. నావివాహమునకై నాకు చింత యేటికిఁ గలుగు? ధరాభార మంతయు మోసియున్న నీయట్టి ప్రేమఁ బెంచు తండ్రి యుండ నాకట్టి చింతకలుగునా? నా వివాహము నీవెప్పుడు తలఁచినఁ గాదు?

వాసంతిక—మామా! నే వచించెదను. చంపకా! ననుఁగోపగింపకుము. మామా! నీవన్న మాటయే సత్యము. ఆవిషయమున్ ద్యానమగుటచే నీకన్నె కాతలఁపు పుట్టి యిట్లయిన్నది

చంపక—మంచివినోదమాయెను లేవే. నీతో నేఁ జెప్పకుంటినా?

వాసం—ఇఁకూరకుండుము. మా మామ యెంతయో విశ్వాసముగా నడుగుచున్న నిప్పుడేల దాఁచెదవు?

సుదర్శ—వాసంతికా! నీవు నిక్కముఁ జాడితివి. పుత్రీ! నేనేమిచేయఁగలను? మా మణిమంతునికై యిన్నిదినములూరకుంటిఁగాక కానున్న నిన్ని దినములు నిన్నవివాహితగా నుంచియుందునా? ఆప్రాప్తము నాకు లేదు. పదునైదు, పదునాఱు వత్సరములయ్యె వానిపొలకువయే కానరాలేదు. ఇంతవఱకు లేని యాశలు కల్పించుకొనుచుంటి. మొన్న కేరళ బ్రాహ్మణుఁడు వ్రాసినజాబుపై నింక నిరాశయాయె. చెంచువానితో నీపదునైదు వర్షములు నూరూరు తిరిగెనఁట. వాఁడు తుదకఘోరుండను బోయవానిఁ జూపెనఁట. వాఁడో యెంత బాధించినను దనకేమియుఁ దెలియదను చున్నాఁడఁట. ఆ చెంచువాఁడే పారవడియెనో కాక దేశము దిరుగఁ జాలకవిసిగి యెవ్వనినో యొకనిఁ జూపెనో యేమిగతియో తెలియకున్నది.

వాసం—మామా! మా కేరళ బ్రాహ్మణుఁడు వారినిఁ బిలుచుకొని వచ్చెదనని కదా వ్రాసెను.

సుదర్శ—అవును మొన్నయుదయముననే రావలసియుండె. ఇదివఱకు రాలేదు. ఏమయిన ఫలమున్నఁ గదా వచ్చును.

చంపక—జనకా! నాకొఱకై యెంతయో వగఁ జెందితివి. హతభాగ్యురాలగు నాకు నా మణిమంతుఁ డెక్కడ లభింపఁగలఁడు? (దుఃఖించును).

## అనుబంధము ౩౯

సుదర్శ—పుత్రికా! దుఃఖింపకుము. ఎప్పుడో యాశవిడిచిన వానికిప్పుడు దుఃఖించి యేమి ప్రయోజనము? మణిమంతుని భాగ్యమిట్లయ్యె. వాసంతికా! శోకింపకుము. ప్రయోజనమేమి? మణిమంతుని భాగ్యమిట్లయ్యెఁగదా? ఇంకెవరినైన నరయుదము కుమారీ! నీమనసునకు వచ్చువాఁడెవడైన నున్నాఁడా?

చంప—అయ్యో! నీమనసున కెవఁడువచ్చునో యతడే నామనసునకు వచ్చువాఁడు గదా!

సుదర్శ—పట్టీ! మన కుంభీనసుని కుమారుఁడు మదనుఁడెట్లు?

వాసం—(తలవంచును)

చంపక—రామ ! రామ ! అయ్యో ! ఆమాటనకుము.

సుద—అమ్మరో ! ఇదియేల?

చంపక—అయ్యో ! చెప్పవలసివచ్చినందునఁ జెప్పనేవలయు. తండ్రీ! నీవు నాపైఁ బ్రేమగల వాఁడవనుట కెన్నియో దృష్టాంతములు కలవు? ఇప్పటి నామాట జయప్రదము చేసి యిది యొక్కఁడగు దృష్టాంతము. ఆమదనుఁడు నాతోడఁబుట్టువుగా భావింతు. నాయనుంగు మఱఁదలి వాసంతిక వానియెడఁ దప్పని పతిభావము వాటించియున్నది. ఆమదనుఁడును వాసంతికయే తనభాగ్యలక్ష్మిగా భావించియున్నాఁడు. ఇంకేమి కావలయును? నీయానతి యొక్కటియేకదా? నావివాహమునకై యోచింపకుము. నీయిష్టము వచ్చినప్పుడు కాఁగలదు. పుత్రినగు నాయెడ నీకు నిక్కంపు కరుణ గలదేని యీవాసంతికా పరిణయమున కానతీయవలయునని యత్యర్థము విన్నవించుచున్నాను. (నమస్కరించును)

వాసం—(లజ్జించును).

సుద—(వాసంతికయెడను-జంపకమాలినియెడను జూచి) తనయా! లెమ్ము. నీవింత ప్రార్థింపనేల? ఈమదన వివాహమునకుఁ గుంభీనసుఁడొప్పుకున్నాఁడా?

చంప—విషయను-జంద్ర-హాసున (గుటికలు మ్రింగి) కిమ్మని మదనునకు వ్రాసెనని నేఁ జెప్పియున్న యాజాబునందే దీనికి నతఁడంగీకరించియున్నాఁడు.

సుద—అట్లయిన మిక్కిలి మేలయ్యె. నాకుఁ బరమ సమ్మదమగుఁగదా? తనయా ! నీ యభీష్టము నెఱవేర్చుట? రేఁపే వివాహప్రయత్నము నొనరించెద.

వాసం—మామా ! పుత్రిపై గరుణగలుగుట నీకబ్బురము కాదు. నైజమే. చిన్ననాఁటినుండి తలిదండ్రుల నెఱుఁగక నాతల్లియుఁ దండ్రియు దైవమును నేడుగదయు నీవేయని భావించియున్నదానను. పుత్రికంటె నన్నెక్కువగా మన్నించి పెంచి రక్షించితివి. నీపుత్రి యభిలాషమైన నొకప్పుడు నీవు లేదని యన్ననియుండువుగాక నాకుఁ దీర్పని యభిలాషమే నీకుఁగలుగదు. అట్టినన్ను వ్యాజ్య కరుణచే నీనాఁడు మనస్తృప్తి కలిగించితివి.




## అనుబంధము 40

ఈ సంతోషసమయమున నేనిన్నొకటి యడుగుదును. నీవవశ్యము నెరవేర్తువను విశ్వాసమున నే యడుగ సాహసించెదను. నాయనుంగు నీచంపకమాలిని మదర్థము వరించిన వాఁడీ యూరనేయున్నాఁడు. మాయింటొక్క యనుంగగు విషయను [illegible] మొనర్చియన్వర్థాభిధానమగు చంద్రహాస నామమును వహించియున్నవాఁడు. పుత్రి యభిలాషము నిండింపను గాపాడిన భంగి నాయభిలాషము నిండింప నీపుత్రి నింత రక్షింపుము.

సుద—(ఆశ్చర్యమున) తనయా ! నిక్కమా !

చంపక—(లజ్జించును.)

సుద—అమ్మరో! నీకట్టి యభిలాషమా! కృతసాపత్నికయై యావిషయ యుండ నీవు భోగినీత్వమున కియ్యకొందువా?

చంపక—జనకా! ఇంక నీయెదుట నాడుటకు సిగ్గేటికి? నీవు విషయ వధ్యాధాత్వము సిద్ధించుటకు శకించిన మాటలాడితిఁగాక వరవైలక్ష్యమునకు శంకింపనైతివి. ఇంతియే చాలు. ఆవిషయయును నేనును బరమాప్తులము. ఆమనోహరునకై దాని దాసియనిపించుకొనఁజాలుదు. అందునున్న చరిత్రము కడువింత. ఆ చంద్రహాసుని తొలుత మోహించినది నేను. అతఁడు తొలుత మోహించినది విషయను. మాలో నెవ్వరధి విన్నయన్నను గావచ్చును.

సుద—తనయా! మీ యిరువుర వృత్తాంతములు వింతలుగా యున్నవి. మీయభిలాషముల దీర్చుటకంటె నాకు వేఱుకార్యము కలదా? అయినను మీజననితో మాటాడ వత్తును రమ్ము.

క॥ ఎడఁగానకెందు మిమ్ముం
దడయక నేఁజూతు నాదుధననిధులనుచు
నుడుగని మీయభిలాషమె
కడునా యభిలాషమయ్యెఁ గామినులారా॥

(నిష్క్ర—)

—0—

శ్రీ

# అభిజ్ఞానమణిమంత్ర నాటకము.

## పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

సుదర్శనసంతోష పురము.

[ప్ర॥ సుదర్శనుఁడు కేరళబ్రాహ్మణుఁడు. చెంచువాఁడు.]

విమర్శాద్యంతః పురస్త్రీలు. (దూరమున)

సుద—బ్రాహ్మణోత్తమా! మొన్న నే నేమియు తెలియక దొంగయని యున్న వాని నిర్భ్యోడకుఁ బిలుచుకొని వచ్చినందున నేమిఫలము?

బ్రాహ్మ—రాజేంద్రా! వాఁడు గాఁ కింకరుఁడుండఁగు. మన రహస్యములను స్పష్టముగను నెఱిఁగినవాఁడు. ఏమిదుష్కృత్యము నొనర్చి యున్నాఁడో మాటిమాటికి నొక్కినాఁడు.

సుద—అవును. మనమింకఁ జేయవలయునుపాయమేమి? విప్రనాయకా! నీ వెలుపలనుండి యుండరాదు?

చెంచు—జియ్యా! నేనా చెట్టు చాటుననున్న పుడే తొలుత లెక్కలు మాటలాడిన జాడ వింటిని. పేరుపిలిచినదియు వింటిని. మఱచిపోయియున్న కతమునఁ దొల్లి నుడువలేనైతి. పట్టిన వెంటనే వీని పేరు తెలిసె. తెలిసినంతనే యఘోరుఁడనుట మదికి వచ్చె- వీఁడు గాఁ కింకరుఁడు కాఁడు?

సుద—అయిన నాయఘోరుని బిలిచికొనిరమ్ము.

చెంచు— (నిష్క్రాన్తః)

సుద—సేవకా! ఇప్పుడ పోయి మా [illegible] మంత్రినిఁ బిలుచుకొనిరమ్ము.

(పునః ప్ర॥ చెంచు అఘోరునితో).

అఘోర—స్వామీ! దండం.

సుద—అఘోరా! కూర్చుండుము. నీ ముఖము నాఁచిన నీవు సత్యవాది వనుట చాటుచున్నది. ఇట్టి యబద్ధములాడినఁ బ్రయోజనము లేదు. అఘోరా! నీ పుణ్యమగును. నీ చేతులంటి వేఁడుకొందును. ఆకుమారుఁడు నీచేత నే చిక్కినాఁడు. నీ వేమొనర్చియున్నను భయపడక వచింపుము. చంపియున్నను చెప్పినమాత్రము చెప్పితివా దుఃఖపడను. నిన్నుఁ దండనము. ఇంకేభంగి నెట్లొనర్చియున్నను సంతోషమున నీకు బహుమతియిచ్చెదను. నిను వేఁడికొందు వచింపుమా!

అఘోర—సోమీ! నీవుమాతోకరాయఁడున్నట్టుండావు. నీయెదుర్గా కల్లలాడేదిలేదు. మాయబ్బతోడు-నీతోడు-తోకరాయణితోడు. సత్తిగం-సత్తిగం-సత్తిగంసెప్తాను. ఆపొద్దూరేతిరికాడ పిండిపోశినట్టు యెన్నెలుండాది. ఎవ్వఁడోన్యాలి, నల్లగ నెత్యాల్లు కాణ్ముంటికాలోపదంకా సల్లాడం, అంగీ, పైఅంగి, నిండాకరే-కరే-కరే మొద్దాల వచ్చినిల్సు కొనుకోని అగ్గోరా! అగ్గోరా! నన్నుపిలుస్తాడు. పిలుస్తాడయ్యా అంటె. సత్తిగం-సత్తిగం తోకరాయడున్నట్టుండావు; ఏయూరప్పాయంటె. శేతిలో అట్టేయొయ్యిరూపాయలు పోశిండాఁడయ్యా. పోశిండాఁడు యొయ్యొరూపాయలు. యొయ్యా, నూరో, లచ్చో దానన్నాలాయేడికిఁ దెల్సు? యిన్నిరూపాయలు పోశిండాఁడు. మా న్యాస్తగాడెయ్యి రూపాలనె పోశిండాడు. యేమి శెయ్యాలేప్పా యంటె? గళ్ళోబుడుతోడుండాను, వతికేశానోద్దెస్తే యింకాకోటిరూపాలిస్తా నంటాడు నేనన్కోంటె! యీగాడ్దుల్కు బుట్టిన్నాయాలు బుడుతోణ్ణి నర్కేశే యింతిస్తాడఅన్కోంటె. నూస్తి యెంత్నేపోతి. గుళ్ళోకి రమ్మంటాడు-పోతి-పిల్లోడుండె-యెత్తుకొస్తి-నూస్తి-అయ్యా తోఁకరాయణితోడు సెప్తాను-ఆయొయ్యా-ఆయొయ్యా-అయ్యొ యెంతముద్దోస్తుణ్ణాయ్యా?

బ్రాహ్మ—చంపితివా?

అఘోర—నిలశ్శి. కుయ్యారు. ముద్దొస్తుణ్ణోయ్యా! నూస్తి. నర్కేశిశగ్యాడ్లే. నేనూ నా న్యాస్తగాడు మట్టాడు వుంటాంగదా- యీనామ్మనాయాలు యీ శెంచోడు గొణి కేసి గొణికేసి గొణికేశి శెట్టు మగ్గుముంటిస్తుండె. గంద్రగొడ్డలితీస్కొని మొత్తాల్నని పోతాను, మూగినాకొండాలేనయ్యా-లేకుంటేబూడాలకానా తెంచేస్తూంటె. యెంతమోసం శేశిండాడయ్యా-సత్తిగం-సత్తిగం తోకరాయఁడున్నట్టుండావు.

బ్రాహ్మ—పాపనేమిచేసితిని చెప్పుము?

అఘోర—సోమీ! యీ బాపన్నాయాలు నోరు మూయించు. ఈడు భలేదబ్బర నాకొండే.

సుద—బ్రాహ్మణా! ఊరకుండుము. అఘోరా! తర్వాత నేమాయె.

అఘోర—ఇంకన్నా ఫూర్కో-బాపన్నాబట్టా! అక్కడముంటి యీ మూగినాకొండె నేంట్కి సంపాల్నని పిల్లోణ్ణి కొండ్పోయి-పండబెట్టి-యెంతముద్దొస్తుణ్ణోయ్యా!

సుద—చంపితివా?

అఘోర—అద్దిగో! నీకూబుట్నే తెల్వు. శెప్తాన్నేండి యేలసస్తారు. సంపింటేయెవ్రు పీక్కుంటుంద్రి. బొట్నెలుకొని తీస్కుపోయి ఆకద్రినాయాల్కు నూపంచి దుడ్డు గుమ్మకొనిపోత్మి.

సుదర్శ—హా! దైవమా!

[ప్ర: సేవకుఁడు మదనునితో.]

సేవక—దేవా! మంత్రిగారింటిలో నుండ లేదు. మదనమంత్రిగారిని పిలుచుకొని వచ్చియున్నాను.

సుదర్శ—మదనా! చంద్రహాసుఁ డెందున్నాఁడు.

మదన—ఏదో పూజకుఁ బోవుటకని పూజాద్రవ్యముల సేకరించుకొనుచున్నాఁడు ఇప్పుడేల?

సుదర్శ—నీ వీ క్షణమునఁబోయి వానిఁ గొనిరమ్ము. వైళము-శీఘ్రము-తత్క్షణము-వానికేదేని పనియున్న నాపని నీవొనరింతువని పంపుము. ఇప్పుడే వేగిరము తడవు సేయక.

మదన— (నిష్క్ర.)

సుదర్శ—అఘోరా! నీవు వచించిన చరిత్రము మాకు సంతోషావహమయ్యె. పోనిమ్ము ఆ బాలునిఁ జంపుటకు నిన్ను నియమించినవాఁ డెవఁడు!

అఘోర—యట్లాముస్సంగి నాయాలయ్యా. అవుతే వాణ్ణిసూశిండ్లే. బళ్కొ-రంగా సూస్తె మొగంమీద ముక్కు ఆట్లాయే సూస్తాను ఎంత పెద్ద ముక్కు-యా. యిప్పుడు సూపిస్తే పట్టుకొస్తాను. ఇయిగో వాడిచ్చిండే యెయ్యిరూపాలన్ని తాగి-తాగి శెడదాగిపాడు శేస్తి-మాయబ్బతోడు నీవు తోకరాయఁమున్నట్టుండావు యీ కాడ్కె యీ రెండు రూపాయలు నిల్సింది. (అని 3 రూపాయలిచ్చును.)

సుద—(చూచి) బ్రాహ్మణా! ఇవి మా రాజ్యములోని ద్రవ్యము. ఇదే నాముద్రయున్నది. ఆదుర్బుద్ధి రాజ్యముననే యుండవలయు. ఈయఘోరువందందుఁగొనిపోయి గుఱుతించునట్లొనర్తుము. మామణిమంతునకు నెడమభుజముపై గురుతు మచ్చయుండెనని చెప్పియుంటివి. ఇప్పుడు చంద్రహాసునిఁ జూచిన విశదము కాఁగలదు.

(ప్ర॥ చంద్రహాసుఁడు.)

సుద—(చంద్రహాసునిఁ గూర్చుండఁబెట్టి భుజము పరీక్షించును.)

అఘోర—వోరిపిల్లనాకొండ్యా యీడ్యాడొస్తివిరా!

సుదర్శ
బ్రాహ్మ } హా! మణిమంతా! మణిమంతా! (ఆలింగనము)

చంద్ర—మణిమంతా! నేమణిమంతుఁడనా? నాపాలక జనకుఁడదుగగా "మహ్మంత" యంటివేఁటి. ఆమణిమంతుఁడను పేరివాఁడ నేనా?

వాసం—(రభసముగఁ జనుదెంచి) హా! అన్నా! మణిమంతా! నాకులభింపవనిదుఃఖించుచున్న సోదరా? (ఆలింగనము చేసుకొనును.)

సుద—కుమారీ! ఇంకేల తడవు? నాకోరినభంగి మణిమంతుఁడును నీకోరినచంద్రహాసుఁడునునగు నితఁడే నీకొదవె. ఇదియేసుముహూర్తము (చేయిపై చేయిపెట్టించును)

చంద్ర—ఏమిటిదిది. యేమిటిదిది? నాకింతయైన వచింపుఁడు.

అఘోర—ఓ-యన్నల్లాలా! మణిమంతా -మమ్మతా -మణిమంతా -మమ్మంతా-(ఎగ రాడును.)

సుద—మణిమంతకుమారా! సావధానముగఁ గూరుచుండుము. నీచరిత్రమంతయు వివరించెద.

మణి—ఈ యున్మత్తురాలని సేవించియున్న కాంతామణి యెవరు?

వాసం—అన్నా! అది మోహోన్మాదము.

చంద్ర—అయిన నేనెవ్వఁడను.

సుద—అందు గూర్చుండి మాటలాడుదమురండు. ఈ యఘోరునకిఁ జక్కని బహుమాన మిప్పింపవలయు.

అనుబంధము 42

అఘోర—ఇట్లయ్యేటట్టయితే దినాము వొక్కొక్క-పిల్లోన్ని కోండోచ్చనే?

(నిష్క్రమి.)

——:o:——

## పఞ్చమాఙ్కము-ద్వితీయరంగము.

### కుంతల కార్యాలయము.

[ప: కుంభీనసుఁడు (పాముల సంచులతో).]

కుంభీ — వేళయయినది. ఇక్కడి కార్యములన్నియు సిద్ధములైనవి. ఈగర్భగుడివెనుకటి గోడకును దుర్గావిగ్రహమునకును గొంచెమైన నెక్కువ యెడము చాలదు. ఈగోడలోఁ దగినంత గండివెట్టి యున్నాను. ఆదురాత్ముఁడు నేఁజెప్పిన ప్రదక్షిణ మొనర్చుటకై వచ్చి ప్రదక్షిణక్రియను గావించుఁగదా? రెండవప్రదక్షిణకాలముననే యీసంచి లోని పాముల నిట్లె లోపలికిఁ బంపెద. అప్పుడే ముగియఁగలదు. తర్వాత, మూఁడవ సారికి మఱియొక సంచియున్నది. కాని! ఎట్లు తప్పించుకొనునో? అయ్యయ్యో! నాజామాతరయే వాని వధించుట కిట్లేటికి సమకట్టితి? దానివలన నాకుఁగలుగఁగల ఫలమయిన నేమి? ఎట్లును వాఁడు నాచేఁ జిక్కఁబట్టియున్నాఁడు. ఈ రాజబిడ్డ చంపకమాలిని యింక నిశ్శంకముగా నాసుతుం జేపట్టవచ్చును. అప్పుడు నాకుని రాటంకము గదా? ఇట్లేలయొనర్పవలయును? అక్కటా! నాకేమి కాదు వీఁడు నాకుమాజన్మకు ప్రాణుఁడు. వీఁడుండిన నాకు క్షేమము గలుగదని తోఁచుచున్నది. అదిగాక యీకీశ ప్రాపంచిక పాతకుఁడు నాకంటె నసాధ్యుఁడు. నాఁడు దస్యుల నెగదు రాత్రిని బట్టియున్నాఁడట. ఇంతలోన నేవచ్చెదనని జాబువ్రాసియున్నాఁడు. వాఁడు వచ్చిన నాక్షేమమునకు భంగము కలిగినను గలుగవచ్చును. వాఁడునన్ను గుఱుతెఱుంగఁడు నిజమే. అయినను, నేమార్గమున నెట్లు వచ్చునో. అదిగాక నేఁజందనావళిలో నా కుళిందకపాతకుని రాజ్యదారునిగాఁ జేసిన కాలమునఁ జంద్రహాసుఁ డింటిలోఁ జచ్చియుండునని చెప్పితిని. ఇది తెలిసిన నన్ను జను లేమనుకొందురు. ఆవిషయము నాజాబుమార్చియుండుట గుఱుతించి నిన్ననే నామాఱుతోఁ బ్రస్తావనశమున నీ విషయము ప్రశంసించి, "అమ్మా! ఈ చంద్రహాసుఁడు నాకు శత్రుఁడని చంపఁదలంచి మదనునకు వ్రాసి యుండిన జాబు నాపుణ్యవశమున నెవ్వరో మార్చి నీ లగ్నపత్రికగా నొనర్చిరి. ఏమో యొకప్పుడు వానిపై నాకుద్భవించిన సంశయమునుబట్టి యట్లొనర్ప నెంచితి. ఇప్పుడు నీ మగని గుణయోగ్యతలఁ జూడఁగా నా భాగ్యమె భాగ్యమనిపించుచున్నది. నీకుఁదగిన మగఁడుగను నాకుఁదగిన యల్లుఁడుగను నున్నాఁడు. నాకెంతె సంతోషమైన"దని యంటిని. దానిపై నా రక్కసితానే యాజాబును మార్చుట నొప్పుకొని నాచరణములపైఁబడి క్షమాపణము వేఁడె. నేను క్షమించితి నంటిని. ఇప్పుడావిషయవిషయమై నాకేమియు భయము కలుగదు కాని యిట్టిజాబు వ్రాసియుంటి నేయని యదితల

మగనితోఁ జెప్పదనుటకే ముత్తరవాదము? అప్పుడు నేనెట్టి వాఁడనగుదు? ఈచంద్రహాసుఁడు నన్నెట్లు మానయని చూచును? కావున నిది కానిపని. పోవలయును నా చంద్రహాసుఁడుండరాదు. (పాములను గొట్టును. అవియుస్సనును) హా! ఇట్లుండుఁడు.

అనుబంధము 43

మీఱైనఁ దప్పనిభంగి మీపని యొనరింపుఁడు. అదిగో! దూరమున నెవ్వరో వచ్చుచున్నట్లున్నది. ఆహా! ఆచంద్రహాసుఁడే మ్రొక్కుబడి చెల్లించుటకు వచ్చుచున్నట్లున్నది. ఆహా! ఈదురాత్ముఁడు తనవృత్తి నించుకైన గుఱుతెఱుఁగఁడుగా? (పాములఁగొట్టును).

[ప్ర: మదనుఁడు (పూజాద్రవ్యములతో).]

మదన—మాయయ్య నాతో నొక్కనాఁడైనను మనయింటనున్న యీ ప్రదక్షిణ సంప్రదాయము చెప్పఁడాయెఁగా! ఎవ్వరి పెండ్లియుఁ గాలేదు. ప్రస్తావనయును గలుగలేదు. నాకు మిక్కిలి యాతురముగా నున్నది. కుంతలేశుఁడంత శీఘ్రముగాఁ జంద్రహాసుఁ బిలువుకొని యేలనమ్మెనో తెలియు కుతూహలము మిక్కిలిగానున్నది. శీఘ్రముగఁ బ్రదక్షిణ మొనరించి పోయెద.

(గుడిలోనికిఁ బ్రదక్షిణ మొనరింప వచ్చును).

అనుబంధము 44.

కుంభీ—(రెండవ ప్రదక్షిణమునకు గొందగఁడినుండి పాములఁగొట్టి విడుచును. పాములు రభసమున మదనునిఁ గఱచును).

మదను—హా! హా! దైవమా! (అని క్రిందఁబడును).

కుంభీ—(మిగిలిన పాముల మఱల విడుచును. అవియుఁ గఱచును).

మదన—హా! నారాయణ! నారాయణ! అయ్యో! నాపాటున కేమందు? అక్కటా! ఈ వృత్తాంతము మాజననీ జనకులతో నెవ్వరుచెప్పువారు? అక్కటా పాములువచ్చినట్లు భయము కలిగించునని చెప్పినమాట యథార్థముగనే నడచెఁగదా! దైవమా! ఈయరణ్యమున నీయర్ధరాత్రమున నన్నెవ్వరు రక్షించువారు? నను మాయింటి కెవ్వరు గొనిపోవువారు? అయ్యయో! నాకిట్లవునని యొక్కనాఁడును దలంపఁగదా? జననీ జనకులు సర్వమహైశ్వర్యములు గలిగియుండియు నాకు నిట్లు దిక్కులేని చావు గలుగనే? నేనేమి చేయఁగలను. దైవమును భజించెదఁగాక ఒకటిమాత్రము నాకుఁ గడు సంతోషము. దిగంతవ్యాప్త మహాయశుఁడై కరుణాగుణ భూషణుఁడైయున్న నామఱఁది యాచంద్రహాస జనవరుండిచ్చటికివచ్చియుండెనా యతని కీగతి గలిగియుండుఁ గదా? అట్లుగాక నేనే దైవాయత్తతమై వచ్చియుండినందున నాకింత యూఱట గలిగెను. అయ్యయో! ఆ చంద్రహాసున కిట్లయియుండిన నాకును నాప్రియసోదరి విషయ

సహింపక తెగించి యిట్టికార్య మొనర్చినది యీమోహాంధుఁ దనయుని మారణక్రియకో దైవమా! నీ వాచంద్రహాసు నెట్లు కాపాడ నేర్చితివి? నన్నెట్లు పరిభవింప నేర్చితివి? కుమారా! మదనా! నేనీపాలిపగదాయ యమకింకరుఁడనుమా! నీతండ్రిగాను. నీముద్దు మోమింత నాకుఁ జూపుము. కన్నెత్తి నన్నింత తిలకింపుము. తనూభవా! నా చేతులార నేనే నినుఁ జంపుదునని యెక్కనాఁడు నెఱుఁగనుమా. నీవెన్నఁడైన నను కొంటివా! తనయా! నాపాలి మాలదైవము నన్ను నీహత్యకారుఁగాఁ గావించెఁగదా? పట్టీ! నీతల్లికి నీకడమాట యేమి వచించెదవు? నే నెట్టి దురాత్ముఁడ నైనను, నెట్టి హంతవ్యుఁడ నైనను నీపై మోహము వాయని నీతల్లి కలదుకదా? ఆయమకేమి మాట చెప్పెదవు? అన్నా! ఏల యిట్లు కన్నులు తెఱవకున్నావు?

అనుబంధము 46.

నీ వాసంతికను నీవు మాఱనైనఁ జూడవైతివే? అయ్యో! దైవమా! నిను వధించిన కాలసర్పములు నను వధింపఁగూడదా? హా! వాసుదేవ (అని మూర్ఛ).

[ప్ర: శీఘ్రగమనమున పూజారివెంట సుదర్శనుఁడు, చంద్రహాసుఁడు, అఘోరుఁడు, చెంచు, వాసంతిక, చంపకమాలిని, విషయ, బిందోజి, కేరళబ్రాహ్మణుఁడు].

అందఱు—హా! ఏమైనది? ఏమైనది?

చంద్ర—హా! మదనా! (అని పైఁబడి) అకటా! నేఁడేమి దుర్దినము? మిత్రమా! మదనా! ఏల నాతో మాటలాడవు? నేనే మపరాధ మొనరించితి?

అనుబంధము 47.

విషయ—జనకా! అగ్రజా! ఒక్కసారియే నాకు మీరయిరువురు లేకపోయితిరే? నే నెట్లు భరియింతును?

వాసం—నాథా! నాఁటిదినములలో మననోములు ఫలింపఁగలవని మొన్న నాకుఁ బూర్ణాశ్లేష సుఖము గలిగించితివే? నన్నిట్లొనర్చుటకా? అయ్యో! నేనెట్లు భరియింతును?

బిందోజి—తాళుఁడు. తాళుఁడు. నేఁజక్కఁగాఁ జూచెదను. (చూచి) ఈకుమారుఁడు సర్పదష్టుఁడై యున్నాఁడనుట కేమియు సందేహము లేదు. ఈమంత్రిసత్తముఁడూరక మూర్ఛిల్లియున్నాఁడని తోఁచెదు. మఱేమియు లేదు ఈకుమారునికన్నను యింకను ప్రాణవాయువులు వెంట్రుకల కంటియున్నవి భయపడకుఁడు. నా మణిమంత్రముల వలన సాధింపఁజూచెదను. (చికిత్స చేయును.)

మదన—(కన్నులు తెఱచిలేచి) ఆహా! ఏమిది? మీరందఱిందు వచ్చియున్నారు.

అందఱు—(మదను నాలింగనము చేయుదురు)

నీకంత తెనుగున కిరవారమంత్రి
నై కూర్మి సఖుఁడవై యకలంకగరిమ
సామంత ధారుణీశ్వరులు పూజింప
భూమిపై విఖ్యాతిఁ బొందినవాఁడ

«నాలోచనమున బృహస్పతి యితఁడు
పాలనంబున రమావల్లభుం డితఁడు
ధైర్యంబునను మేరుధరనాథుఁ డితఁడు
కార్యభాగమున యుగంధరుఁ డితఁడు

స్థిరతేమునఁజూడ దిననాథుఁ డితఁడు
వికజవరమంబునఁ బావకుం డితఁడు
సాధింతునని యన్న సాధించువాఁడు
వేధింప యముఁడైన విడువనివాఁడు'

అని జనంబులు కొనియాడంగ జగతి
ననుపమ విఖ్యాతి నారంగఁగంటి
«జగతీశుఁ డేలయీ సచివుఁ డేపూరు
జగదీశుఁడగు నన్ను సరణిఁ బేర్వడితి

యవనరాజులు "హుజూ"రనిపిల్చుపలుకు
లవనీశ వరునిఁగా దారయనన్ను
యిలకొని నింతైన నెఱుఁగరుకనరు
చెలఁగి మెల్లైజ "దివాన్జి"గారటన్న

"భళిరా" యటందురు ప్రజలెల్లనన్ను

నింతటివిఖ్యాతి యింతటిగరిమ
యింతటిప్రాభవ మేరీతిఁగలిగె
సుగుణంబునను గాదు సురుచిని గాదు
సుగటిమిఁగాదు ధర్మంబునఁగాదు

భూతదయనుగాదు పుత్రునఁగాదు
ఏతపంబునఁగాదు హితమునఁగాదు
దాపక నాచరిత్రము వెల్లడింతు
నీపట్టునమదీని నేపారవినరె

బుద్ధివచ్చినదినం బులనుండి నేను
శుద్ధవర్తనమును జోలియెఱుంగ
నకలంకమానసం బదియొందు నెఱుఁగ
నాకరుని మేలునే నోర్చియెఱుంగ

నారునింటఁ బెండ్లిగా నున్నదటన్నఁ
దరముమీఱినసరి తాపంబుఁబూని
యాపెండ్లి శ్రాద్ధమా నందొఁకవగచి
వాపోయి పలవించి వడిసోలుచుందు

ఒరునకొక్కెసంఁ బుత్త్రిఁ బుదయించెనన్న
గురుతాపమున నామనోమరుగుచునీల్గు
సదనమునవెంతయు సారాటపడుచు
సదివాసగహునైన వాపోవుచుందు

నెవఁడైన దనద్రవ్య మేపారనిచ్చి
భవనంబుమంచిది పడసెనటన్న
నాభవనముఁగూలి నాపైనఁబడిన
యాభంగిఁదపియించి యడలునమించి

యెడదదావానలం బేర్చినపగిదిఁ
గడయెఱుంగనిరీతిఁ గడుపునమండి
దురపిల్లివడినిప్పుఁ ద్రొక్కినకోఁతి
కరణి నెయ్యెడనైనఁ గాలూనలేక

తాయింటి నిలఁగాల్చు నంతటిదాఁకఁ
జాయని శోకాగ్ని పాలౌచునుండు

ఇతరు లెవ్వారైన నిద్దఱు మంచి
హితులన్నమాట నొక్కింతవిన్న వింత

నెనలేని క్రోధంబు హృదయంబుగలఁప
మనసునిల్వఁగలేక మాటాడలేక

వారలవిహితంబు వారించుదాఁకఁ
గూరుకు నిదురనేఁ గోరకయుండు

ఈయసూయగుణంబు నీయీర్ష్యనాకు
జాయనిదుష్టస్వ భావంబులయ్యె

మిత్రుఁడైననునన్ను మిడుకంగఁగోయు
శత్రుఁడైనను నాకు సముఁడె యీవిధికి.

సంతోషమెఱుఁగ నిచ్చును నెవ్వఁడైన
వింతశోకముజెందె వేళలఁగాని

యిట్టిగుణములుండి యింతటిఖ్యాతి
నెట్టులఁబడసితి నెఱుఁగరుగారె

మోసంబుననుగాక ముదమార నాడు
వాసిచేఁగాదు నా ప్రఖ్యాతియరయ

ఇంపార రాజ్యంబు నెసయుదు రాశఁ
జంపకమాలినీసతి నాసుతునకుఁ

బరిణయంబొనరించు భంగికినడుమ
నరుదెంచు మణిమంతు నకటచంపంగ

మంగళపురికేగి మఱి యఘోరునకు
వెంగలినై ద్రవ్య వితతినిచ్చితిని

చరణాంగుళీయముఁగోసి చలమువోఁద్రోసి
పరిసమాప్తియొనర్చెఁ బరికించివీఁడు
దైవయత్నముగాని తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి
చందనావతికేగి చంద్రహాసాఖ్య
నందమొందుచునున్న యాలోకవీరుఁ
గ్రూరకర్మమునాన ఘోరబాణమున
వారింపఁజూచితి వానికంధరము
కుత్తుక కేసిన క్రూరనారాచ
మత్తఱిఁ జెవిదాఁకి యదివ్యర్థమయ్యె
దైవయత్నముగాని తలపోయుమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి
పెంపరిసుతునకు విషమిచ్చివీనిఁ
జంపంగనొకకమ్మ చయ్యనవ్రాసి
పంపితినాలేఖ వానిమోహించి
సొంపుగాంచినదాన సుతచేతఁజిక్కె
"విష"మనుమాట వేవేగంబచెఱిచి
"విషయ"యంచనురీతి వెలఁదిదామార్చె
"ప్రాణపీడన"మన్న పదముపోనడిచి
"పాణిపీడన"ముగా భావింపఁజేసె
"నుద్వాస"మనుమాట నొయ్యనఁద్రిప్పి
"యుద్వాహ"మనుభంగి నొనరంగఁజేసె
నీవింతయేమన నిటుమార్చితనయ
చావుకమ్మను పెండ్లిజాబొనరించె
దైవయత్నముగాని తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబునుండి
ఇప్పుడేమనవచ్చు నీవిధంబెఱిఁగి
తప్పనినైరంబు దాళఁగలేక
కులముద్ధరించెను కొమరుఁడేజ్ఞాన
బలసమగ్రుండగు పాపఁడీ యత్న



దారగుణుండగు తనయుండే, తనయ
నారచేపట్టిన యల్లుండేయంచు 112
నించుకంతయుఁజూడ కీసుతత్రాడు
త్రెంచుటకైన నేత్తైఱనోర్చి యకట
కాలసర్పంబులఁ గడిమిఁదెప్పించి
కాళికాలయమున గండివెట్టించి 116
మణిమంతుఁడంచు నెమ్మదిఁబొంగివిడిచి
గుణభూషణునినాదు కొమరుఁజంపితిని
దైవయత్నముగాక తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి 120
నానోములఫలంబు నానిదానంబు
నానిందుభాగ్యంబు నావంశఫలము
నాపూర్ణచంద్రుండు నాజీవదాత
నాపెన్నిధానంబు నాముద్దుకుఱ్ఱ 124
నాకూర్మిచుట్టంబు నాచెలికాఁడు
నాకుమారుఁడిటు ననుఁబాసిపోవ
శోకాగ్ని దహియింప సుకుమారుఁజూడ
వేకారి దరిఁజేరు విధిఁగానలేక 128
వగజెందికుంది నెవ్వగలొందికంది
జగతి దుఃఖపుచావు చావలోనైతి
నాకామితార్థంబు నకుఫలంబిదియె
నాకష్టకృత్యంబు నకు ఫలంబిదియె 132
నాయసూయగుణంబు నకు ఫలంబిదియె
నాయీర్ష్యజన్మంబు నకుఫలంబిదియె
నాదుక్రోధగుణంబు నకు ఫలంబిదియె
నాదుమాత్సర్యంబు నకు ఫలంబిదియె 136
ఈచేతఁజేసిన దీచేతఁగుడుచు
వైచిత్రియయ్యె నెవ్వగలింక నేల
అలయనింకేల మహాజనులార
కలుషమెన్నఁడుగాని కమలించుసుండి 140

(అనిచెప్పి బాకుచే పొడుచుకొని పడును.)

అందఱు— హా! హా! అందురు.

(యవనికపడును.)

# అ ను బం ధ ము లు.

—⁂0⁂—

శంభీ—రాగము-పూర్వి-ఆదితాళము.

అనుమానమే చనదు దీనికై
ఘనయో చనయింక నిదేమిటికి॥ ॥పల్లవి॥
మనుజాధముఁడా మణిమంతుఁడు
మనియుండినఁనా కెనయుదుఃఖము ౧
కడుబాలుఁడని కరుణచూపినఁ
చెడిపోయె మనీ యెడనా కార్యము ౨

మణిమంతు—రాగముజంజూటి-ఏకతాళము.

అమ్మా అమ్మా ఆరాటమాయెనమ్మమ్మ
రమ్మన్న రావుగా రావె రావెయమ్మమ్మ ॥పల్లవి॥
దాదీ దాదీ దాబూచియాడిరావేమె
మోదముచూపవే ముద్దుగొనఁగ రావెమె ౧

మణి—రాగము-పీలు-తాళము.

ననుఁబాసిపోయితె చనుబాలనీయక దాదియేలా
బాసిపోయితే చనుబాలనీయక ॥పల్లవి॥
నేనెమిచేసితి నీమోముఁజూపవు
కానరావుగా బూచివచ్చెనె మానవేల ౧

పులిందు—రాగము-జంజూటి-రూపకతాళము.

పాపఁడెవ్వఁడో బాపుబాపురె
రూపుమాడఁగ్గా భూపసుతుఁడుగా బాపుబాపురె ॥పల్లవి॥
పాలపాపని బాలిశాధముల్
కాలుగోసిరి కానఁద్రోసిరి బాలిశాధముల్ ౧

5 సుదర్శ—రాగము-శంకరాభరణము-ఆటతాళము.

పాపులెందు దీసిముద్దు బాలునేమిచేసిరో
పాపఁడేమి పాటుగనెనో తాపమాయెనయ్యయో ॥పల్లవి॥

పాలుగారు ముద్దుసుతుని పైననెంతవైరమో
గోలకెట్టిఘాత కోరిచేసియుందురో ౧

6 కుంభీ—రాగము-కమాజ్-ఆదితాళము.

రాజపుంగవా రాజరాజనాకీ యోజనగలిగెను
ఈ జగంబులోన నాకు హితుఁడవు సఖుఁడవువిభుఁడవు
తలఁపఁగ ॥పల్లవి॥

ధీరా ననునోం డనకు కుసు
పారమెందులేక శోక భారముగలిగెను ౧

భూపా కినుకం గనక నను
పాపజాతినాక చేయు మీపనికరుణను ౨

7 కుంభీ—రాగము-బిలహరి-ఆదితాళము.

బాలచేకొనవే నీలవేణిరో వెలయఁగరావె
లీలాయతను శీలానానుడి లాలింపవేదయ ॥పల్లవి॥

కోమలాంగిరో నీమనోహరుఁ డేమిచేసియు లేమింగ్లెను
లేమాయీవగ నామానసము వేమాఱుగలఁచెను ౧

8 విషయ—రాగము-జంజూటి-ఆదితాళము.

కరుణించి పాలింపుమా ఆలింపుమా జనకా ॥పల్లవి॥

వారకకోరని వానికినన్నిటు భారవైాయనీకునింత
భారమా వైరమా నేరమా గంభీరమా జనకా ౧

ఈ పరిణయమున కోమునిపుత్రిని రూపు మాపనీకుధీర
రూపమా తాపమా కోపమా నా పాపమా ౨

9 విషయ—రాగము-వరాళి-త్రిపుటతాళము.

కనికరమింతైన గణియింప లేకనన్ను
జనకుఁడు విక్రయింప మనసున నెంచెనయ్యో ||పల్లవి||
మనుజాల నింక భూమి నన్నుఁ బ్రోచువారలేర
వెనువెంట బాయుదాన విననొల్లఁ బ్రాణముల ౧

10 మదన—రాగము-తోడి-ఆదితాళము.

నన్ను దూరకు నేరం బెంచకు విన్నపమాలకించి
కన్నతండ్రివి కారుణ్యంబున మన్నింపఁగరాదె ||పల్లవి||
మోసమెంచకు మాఱాడని నీసుతుఁడనుగానే
వాసి నిల్పుముదయచే నాకా వాసంతికఁగూర్చి ౧

11 కుంభి—రాగము-నాదనామక్రియ-రూపకతాళము.

సంతాపమాయెఁ జాలఁగ నాకు
నెంతని నామది జింతింతునో ||పల్లవి||
శోకాంబురాశి సొరిది మునిఁగితి నీకబోవఁగఁ జేసి వెంగలినై
చీకాకుగలిగె
నాకులగతి మీఱ వేకారిదరిఁ జేరు విధిగానను ౧

12 చంద్ర—రాగము-జంఝూటి-అదితాళము.

ఇంతేల చింత సేయఁగా నావంత యువలదు ||పల్లవి||
రనతప్పి బాణము శ్రవణంబుమాత్రమే
దవిలెనో కింతయు తాపముగలుగదు ౧

13 కుంభి—రాగము-వసంత-రూపకతాళము.

బాలసిదగు లీలలెల్లను మేలములాయె
మాలవిధిని న్నెందునింత దూలఁజేయునే ||పల్లవి||
ఏసమంతగ క్రిందుతగుల మోసముగాదే
గాసిపడితినేఁడు చంద్రహాస కుమారా ౧

# అభిజ్ఞానమణిమంతనాటకము.

చంద్ర—రాగము-సురటి-ఆదితాళము.

ఆహా యేమియాశ్చర్యము ఊహాతీతము ॥పల్లవి॥

అలఘువిచారుఁడు సచివేంద్రుఁడనన్నంపెను దనపురికిందు

తెలియఁజాలనేమికలదో దివ్యసుఖము ౧

అందరు—రాగము-తోడి-రూపకతాళము.

కనులార చూడరె వనవైభంబు సొంపుచూపఁగా ॥పల్లవి॥

తరుజాలముల్సర సాలముల్ తమాలనారి కేళముల్

హింతాల తాల సాలకోలముల్ ౧

అళిజాలముల్ బలుకోకిలల్ కలగాన మొప్పఁజేయఁగా

విలసిల్లుకుంజవీథులెల్ల ౨

సరసిజముల్కు ముదంబులుల సరిమీరికన్నుల

కింపుగా నరుదైన నీరజాకరంబులల ౩

వనమల్లికల్ ఘనవల్లికల్ అనువైన వాసనలీనఁగాఁ

జనసొంపునించు పూవుదోఁటలల ౪

చంపక—రాగము-జంజూటి-ఆదితాళము.

వలదమ్మా ముదముమనఁగా ॥పల్లవి॥

ఈ జాబుననీ కింత తెలియదె యోజనలేలసుందరాంగి

వాసంతిక—రాగము-శ్రీరాగము-రూపకతాళము.

తాళఁగలనా బాళియింతైన నింకేలచూడ

బాలయోవిభు జోలిమానిపి చాలదయచేనేలవే ॥పల్లవి॥

ప్రాణనాథుఁడు నన్నుగన్నుల నైనఁజూడకయుండఁగా

దీననైనాప్రాణతతినే నూనియుంచెడుదాననె ౧

చంపక—రాగము-పీలు-ఆదితాళము.

ఊరడు మా యో సారసాక్షి ॥పల్లవి॥

ఈ విధముననే లావగఁజెందెదు

నీ విభుఁగానఁగ లేవె బాలా ౧

19 మదన—రాగము-తోడి-రూపక తాళము.

ఈరీతిగనన్ను దూరవలదు ఎలనాగా
నేరములవియేవి నాయెడ ||పల్లవి||

కడుకోరినాపయిఁ గరుణవహింపవె
తడసిన బడలేదఁ దాళఁజాల ౧

20 మదన—రాగము-నాటకురంజి-ఆటతాళము.

ఇది నాపాపము మందగామిని నీ
మదినింత దయఁజూడు కామినీ ||పల్లవి||

మన్ననసరిగాదు వనితలనరాదు
పన్నగవేణి నీదాసుఁడ ౧

21 మదన—రాగము-హిందుస్థానితోడి-ఆదితాళము.

చెలి నామాట మన్నింపవె నాకు
నామీఁద మునింపవె ||పల్లవి||

కాలానుసారముగా నా కీలాగు చేకూరెనె యీ
జాలియేల తాళఁజాల బాళిలీలబాలా ౧

22 విషయ—రాగము-నాదనామక్రియ-ఆదితాళము.

సుందరుఁడీ ధీరుఁడు ఈ డెందు లేని
అందము లోచనా నందముగానించు ||పల్లవి||

మోహిని యీసొగ సెంతునోరజనీ
కాంతుఁడో జయంతుఁడో వసంతుఁడో యాకంతుఁడో ౧

23 విషయ—రాగము-బిలహరి-ఆదితాళము.

మనసారనీ మహానీయునిన్గంటి ||పల్లవి||
కనుగొనినంత మనసుచల్లనయ్యె జనపాలుఁడీసుందరుఁ

అరుదా యెఁజూడఁ సాకరుచిరరూప
స్ఫురణంబుసార తర తేజమును
నవరూప పంచ శరుఁడౌనో లేక
ధరనున్న పురం దరుఁడౌనో తెలియ ౨

24 చంద్ర—రాగము-ఖమాజ్-ఆదితాళము.

బాలా చాల మేలాయె నీలాగు
పోలఁ జూడనింకనన్ను పొగడం దగదె ॥మగువ॥ ॥పల్లవి॥

విజయ ధీరా సారా చారానీ వీరీతి
కోరియాడధన్యనైతి కొదువల్ తుటగా గదలె ॥పల్లవి॥

చంద్ర నీరమణీయశ్రృం గారవిలాసము
నారీనాకుజూడఁగలిగె నళిన నయన భాగ్యమె ౧

విజయ మాన్యతనన్ను స మ్మానము జేసితి
ధన్యనైతి నింక నేల ధరణీరమణ మేలాయె ౨

25 చంద్ర—రాగము-పీలు-రూపకతాళము.

నినుఁజూడకింతమీా వనినుండఁగాంత
గనుమాయీవింత ప్రేమను బాపుచింత ॥పల్లవి॥

విజయ సదయధీమంతనీ కిదియేమీాచింత
ముదమాయెనింత నె మ్మదిఁ బ్రాణకాంత ॥పల్లవి॥

చంద్ర బలుతమి మించుని మ్ములనీవు పోవ
కలవాణినీవెంటఁ గడఁగి వచ్చెదను ౧

విజయ ఇంతేలనాథనె నిదెపోయివత్తు
ఇంతైనఁ దడయని శ్చింత నెలవిమ్ము ౨

26 చంద్ర—రాగమి-పీలు(హరిసయ్య అనుమెట్టువరస) ఆదితాళము.

నారీమణి సారసపాణిబల్ ధీరగాతరుణీ
చమత్కారము సరిలేనిదమ్యో భళిరెకీరవాణి భళి
భళిరె కీరవాణి భళిభళిరె భళిభళిరె భళిరె భళిభళి

అను. కాంతనన్ను నింతేలకొండాడ వింతయేనా చరిత
నా సంతోషమిందు లెనిదయ్యె నె నెంతో ధన్యనైతి.
(మజవర మనుజవర మనుజవర) ॥పల్లవి॥

చంద్ర సరసీజనేత్రి నన్ను నరుదారం బ్రోచితివి.
కరుణించి మోహము సమకూర్చితివే తమిదీర్చితివే
(తరుణీ తరుణీ ౧

చరణ. మనుజేశ నరనాథ నెనలేని దయజూపి
మానసారగ నన్ను నేలితివి యేలితివి కొనజాలితివి రమణా
[రమణా రమణా నాథ ౧

27 చంద్ర — రాగము-శంకరాభరణము రూపక తాళము.

ఓ రాణీ యనుచు నా ప్యారీ ॥పల్లవి॥
శ్రీకారి రాణీయగు కోకారి దేవియొ

లోకపావని సాకా లోకమోహినియో ౧

28 చంద్ర — రాగము-కానడ-అట తాళము.

న్యాయము న్యాయమా కార్యము ॥పల్లవి॥
భారమాసి వైరమా గంభీరమా నా నేరమా

పాపక పట్టునను నారసి చేయంగ ౧

29 చంపక — రాగము-ఖరహరప్రియ-రూపక తాళము.

సుమగాత్రి సమ్మోహింక నేమి సేయుదు
నామదిని ఘనామోహ మెట్లు తాళుదు ॥పల్లవి॥
పొంగి మోదమా యెనంత భంగమాయె

సింగినేలయుక్కటాయె మ్రింగరాదయె ౧

30 విషయ—రాగము-ధన్యాసి-రూపక తాళము.

మనుజేశుఁడిట్టులైన మనియుండ దాననే ||పల్లవి||
చలమూని నెఱునా జనకుఁడై నావిభు
పాలిఝంటఁ గోరియీ బలుజాబులు వ్రాసెనే
తలపఁగనిది పిలయముఁగద ౧

31 విషయ—రాగము-సావేరి-రూపక తాళము.

భళిభళిరె ఆహా యీ
బలుయోచన నాకుఁదోఁచెను ||పల్లవి||
కనినంత నెయరుదౌనా ఘనభాగ్యవే మంచును
నను దైవము విభూగూర్చి కనికరించి బ్రోచె నేఁడు

32 వాసం—రాగము-నాదనామక్రియ-ఆదితాళము.

విభుఁ డెందునను జూచునోయిఁక హాహా ||పల్లవి||
ప్రాణనాథు గానకున్న ప్రాణము లేననుఁబాయునే ౧

33 మదన—రాగము-బ్యాగు-ఆదితాళము.

మానవతి మనకిది భాగ్యమాయె ||పల్లవి||
ఎంతని నాభాగ్య మెంతు నీరజముఖి
చింతలెల్ల నంతమొందె సంతసము నింతదోచె ౧

34 కుంభి—రాగము-సురటి-ఛాపుతాళము.

భీకరగతినె నీలోకముచూడ నాకెవ్వరైననీఁడా
నాకోపభరము జీకాకు పడకున్న శ్రీకాంతుఁడో
వాణీకాంతుఁడో గౌరీకాంతుఁడో శచీకాంతుఁడగునెమి
||పల్లవి||
భద్రమువిడిచినా రౌద్రముగోర తృళోఁగులుచెడిపోరా

# అభిజ్ఞానమణిమంత నాటకము.

చంపక—రాగము-ముఖారి-ఆదితాళము.

కలుకను యోజనకా హాహా
ఇలగదుపాపిని నేను ||పల్లవి||
బడలితినాకై బహుదినములుగా
కడఁగడునిడుములపాలై విడువవెటుంక నాచింత ౧

వాసం—రాగము-బిలహరి-ఆదితాళము.

కాపాడితివి కరుణ తాపముబాపి
నీఋణమెన్నఁడు దీరుపఁజాలదు
పారమొఱుఁగ జనకా ౧

వాసం—రాగము-కానడ-ఆటతాళము.

చూడనాయె మటాడనాయె
నేఁడునాదగు భాగ్యమునిండె ||పల్లవి||
ఎన్నఁడుగాంతునం చున్న సోదరునినిను
నన్నాయనిపిల్చు నున్నతియాయె ౧

రాగము-శహాన-రూపకతాళము.

మణిమంతుఁడంచునన్నుమీ రనసాగినారు
మణిమంతుఁడెవ్వఁడో మాట విసుపించికావరె ||పల్లవి||
శ్రీమీఱుకేరళాధిపు ప్రేమంపుసుతుడవు
నామేనయల్లు వాఁడవౌ ధామీద తనయా ౧
వాసంతికాయటంచునన్ భాసిల బిల్వుమాను
నాసోదరాకృపాకరా నేసంతసించితి ౨
ఏనాఁడునెబుట్టితి నానాఁడే పేరిడు
నీనారినంచుఁబల్కిరి ప్రాణేశకావవే 3

47 రాగము-తోడి-రూపకతాళము

| | | |
|---|---|---|
| అందఱు | అక్కటా దైవంబమాకీ దిక్కుబాయఁ జేసితే | ॥పల్లవి॥ |
| విజయ | నన్ను ప్రీతిచూపియెందు మన్ననంబుసేయుదే | |
| | అన్న కోనేఁడెలమాట లాడకున్నవాఁడవు | ౧ |
| వాసం | దీనరీతినించునాకు దేరిచూడఁజాలవే | |
| | మానితేనామీఁదకరుణ ప్రాణకాంతపోయితే | ౨ |
| సంద్ర | అయ్యయో నామిత్రవర్యా హారిసుగుణధుర్య | |
| | నెయ్యముపోదోలితెలా నెమ్మినన్నుఁజూడుమా | ౩ |
| సుదర్శ | ఎల్లవేళలందుమాటి యుల్లసిల్లునాడుచె | |
| | చెల్లఁబోయీలోననిట్టి చెటుగల్గఁజాలెనె | ౪ |
| చంపక | ఎంతప్రీతిచూపుచుంటి వింతమోసమాయెనె | |
| | వంతచేసంతియెలా గింతపాటుతాళునో | ౫ |

మంగళం.

